# కె.పి. జ్యోతిషమ్

## 4 స్టెప్ థియరీ-సబ్‌లార్డ్ భవిష్య ఫలితాలు

## యోగినీ దశలు-ఫలిత జ్యోతిష పద్ధతి



- బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్ కుమార్

కె.పి. జ్యోతిషమ్ - యోగినీ దశలు

# కె.పి.

# జ్యోతిషమ్

( 4 స్టెప్ థియరీ - సబ్‌లార్డ్ భవిష్య ఫలితాలు )

---

## యోగినీదశలు - ఫలిత జ్యోతిష పద్ధతి


సాహిత్య విద్యా ప్రవీణ; తర్క - వేదాంత ధురీణ

జ్యోతిష - తంత్రపారీణ, చతుష్షష్టి (64) తంత్ర అనువాదకులు

**బ్రహ్మశ్రీ మేడవరపు సంపత్‌కుమార్**

ఎం.ఏ., సంస్కృతమ్





పబ్లిషర్స్ : ☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్** 45/-

అజంతా హోటల్ ఎదురుగా,

కోటగుమ్మం, రాజమండ్రి -533 101.




2010

# విషయసూచిక

ఉచ్ఛిష్ట మహాగణపతయే నమః

శ్రీ కె.పి కృష్ణమూర్తిగారు (మద్రాస్) ఆవిష్కరించిన నూతన జ్యోతిష విధానం కె.పి.జ్యోతిషంగా దేశ విదేశాల్లో ఎంతో ప్రాచుర్యం పొందింది. ఎంతోమంది చాలా ఖచ్చితంగా భవిష్యఫలితాలు చెప్పడంలో పట్టుసాధించారు.

ప్రత్యేకంగా, కె.పి. అయనాంశ ననుసరించి అత్యంత ఆధునిక పద్ధతులతో సహా గణిత ప్రక్రియ వివరించే చక్కటి సాఫ్ట్‌వేర్ "జ్యోతిషదీపిక" కూడా బెంగుళూరులో రూపొందించారు.

సబ్ లార్డ్ విధానాన్నే అతిసులభంగా 4 అంచెలుగా సూక్ష్మీకరించి పరిశీలించే విధానమే "ఫోర్‌స్టెప్ థియరీ" కె.పి. జ్యోతిష విధానంలో ఫలితాలు చెప్పడంలో 2 పద్ధతులున్నాయి.

1. కస్పల్ రూల్ (భావస్థితి); 2. సిగ్నిఫికేటర్‌రూల్ (కారకస్థితి) దశా, అంతర్దశలతో నిమిత్తం లేకుండా, కస్పల్ రూల్ కొన్ని సందర్భాల్లో నూటికి నూరుశాతం ఫలితాలనిస్తుంది. ఈ నియమం సాధారణంగా ఎక్కడ వర్తిస్తుందంటే ఆకస్ప సబ్‌లార్డ్ యొక్క నక్షత్రంలో ఏ గ్రహాలూ లేనపుడు ఆ సబ్ లార్డే ఆభావ ఫలితమిస్తాడు. భావంయొక్క నక్షత్రం సబ్‌లు, దశాంతర్దశలుగా పరిగణించవచ్చు.

ఉదా: 1

ఈ జాతకుడి 4-12 భావాలు ఇలా ఉన్నాయి. చంద్రుడి సబ్‌లో ఏ గ్రహాలూలేవు.

4 - శు । గు । చ

12 - చ । గు । చ

జాతకుడికి గురుదశ చంద్రాంతర్దశలో 4 భావఫలితాలు, 12వ భావ ఫలితాలు రెండు జరిగాయి. 4వ భావానికి సంబంధించి నూతన గృహం, కారు కొనడం జరిగింది. అప్పటివరకూ తల్లికి దూరంగా ఉద్యోగంలో ఉన్నవాడు, తల్లిదండ్రుల ఊరికే ట్రాన్స్‌ఫర్ అయివచ్చాడు. అలాగే 12వ భావానికి సంబంధించిన చెడు ఫలితాలు జరిగాయి. భార్య కలహంతో విడిపోయింది.

ఇక సిగ్నిఫికేటర్ రూలు (కారకస్థితి)ని వివరిస్తాను.

ఉదా. 2 :- కెనడీ 29-5-1917; కన్యాలగ్నం. ఆయుర్దాయ నిర్ణయం లగ్నం సబ్‌లార్డ్‌వల్ల నిర్ణయించడం జరుగుతుంది. ఈ జాతకుని లగ్నం సబ్ లార్డ్ గురుడు 7లో మారకస్థానంలో ఉన్నాడు. గురుని నక్షత్రంలో ఏ గ్రహాలూ లేవు. ఈ గురుడు 9తో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు.

గురుడు 7లో ఉండటం, బాధకుడు కావడంవల్ల అల్పాయువు (33సం॥ లోపు) అయినా నక్షత్రస్థితి చేత 9లో ఉన్న కేతు నక్షత్రమందుండుట చేత పూర్ణాయువు పట్టినది. కాని ఈ గురుడు కేతువు సబ్‌లో ఉన్నాడు. కేతువు 9వ స్థానంలో ఉన్నా ఆ స్థానాధిపతి అయిన బుధుడు 8లో ఉండి ఏ గ్రహ మూలేని 12వ స్థానాధిపత్యం కలిగియున్నాడు. కనుక కేతువు బుధునికి ప్రాతినిధ్యం వహించి మధ్యమాయువు (66 సం॥లోపు) కలిగించాడు. ఈ విధంగా **గురుడు మారక బాధక సిగ్నిఫికేటర్** అయ్యాడు. ఈ జాతకుడు గురుదశ గురు అంతర్దశ చంద్రవిదశలో 46వ యేట హత్య కావింపబడ్డాడు.

సిగ్నిఫికేటర్ రూలు విశ్లేషణను ఇకముందు వివరించునపుడు గ్రహము అందున్న నక్షత్రాలు, ఆ గ్రహమున్న సబ్ ఇలా వివరించబడతాయి. స్థితి / ఆధిపత్యములు కూడా తెలుపబడతాయి.

గు 7-కే9-కే9/బు8/12

## మరణ విధానం

జాతకుడు ఎలా మరణిస్తాడు ? ఎక్కడ మరణిస్తాడు ? అన్న వివరములు 8వ భావం దాని సబ్‌లార్డ్ ద్వారా తెలుసుకోవచ్చును.

.ఈ జాతకంలో 8వ భావం సబ్‌లార్డ్ బుధుడు, ఇతడు క్రూరగ్రహమైన కుజునితో కలసి, అగ్నితత్వరాశియైన మేషంలో ప్రమాదాల స్థానమైన 8వ భావంలో ఉన్నాడు. ఇది అసహజమరణాన్ని సూచిస్తున్నది. కెనడీ టెలిస్కోపిక్ గన్‌తో కాల్చి చంపబడ్డాడు.

ఇక ఫోర్‌స్టెప్ థియరీ వివరించేముందు అతిముఖ్యమైన రాహు-కేతు వుల ద్వారా సిగ్నిఫికేటర్స్‌ను ఎలా గ్రహించాలన్నది వివరిస్తాను.

# రాహువు - కేతువులు

రాహు-కేతువులు ఛాయాగ్రహములు. వీరికి ప్రత్యేకించి ఆధిపత్య స్థానములు లేవు. కె.పి. జ్యోతిషంలో వీరిని ఎవరి ప్రతినిధులుగా గ్రహించాలన్నది ముందుగా తెలుసుకోవాలి. వీరు పరస్పరం 180 డిగ్రీల దూరంలో ఉంటారు. కనుక ఎప్పుడూ సమసప్తకంలోనే ఉంటారు.

1.రాహువుతో కలసిన గ్రహాల స్వస్థాన ఫలితాలు రాహు అంతర్దశలోనే జరుగుతాయి. లేదా రాహుదశలో ఆయా అంతర్దశల్లో ఫలితమిస్తాయి. రాహువు ఒక్కడే ఉన్నపుడు తానున్న రాశినాథ, నక్షత్రనాధ ఫలితాలనిస్తాడు.

2. కేతువు కేవలం అతడున్న రాశినాథ నక్షత్రనాధ ఫలితాలే ఇస్తాడు. రాహువువలె తనతో కలసిన గ్రహాల ఫలితాలనివ్వడు.

ఎందుచేతనంటే, కేతువుతో మరొక గ్రహం కలసినపుడు, అది రాహువు యొక్క సప్తమ దృష్టిచే చూడబడుతుంది. కావున కేతువుతో కలసిన గ్రహ ఫలితం రాహువే ఇస్తాడు. కేతువు ఇవ్వడు.

3. మరొక ముఖ్యవిషయం ఏమిటంటే, కుజ, గురు, శనులు వారి సప్తమ దృష్టితోగాక ప్రత్యేక దృష్టులతో కేతువును చూచినచో అపుడు కేతువు, ఆ కుజ, గురు, శని ఫలితాలు ఇస్తాడు.

# 4. స్టెప్ థియరీ

ఈ మహాదశ యోగిస్తుందా ? యోగించదా ? ఎలా ఉంటుంది ? అన్న విషయం నిర్ధారించడంలో దశానాధుణ్ణి ఫోర్‌స్టెప్ థియరీ ద్వారా పరిశీలించి పూర్తి వివరాలు తెలుసుకోవచ్చు.

అలాగే వివాహం ఎప్పుడవుతుంది ? అనే విషయంలో 7వ భావ సబ్ లార్డ్‌ను ఈ ఫోర్‌స్టెప్ థియరీ ద్వారా పరిశీలించి ఫలిత నిర్ధారణ ఖచ్చితంగా చేయవచ్చు.

1. స్టెప్ – దశానాధుడైన గ్రహం, లేదా భావాధిపతి లేదా కస్పల్ సబ్ లార్డ్ 2. స్టెప్ – ఆ గ్రహం ఉన్న నక్షత్రాధిపతి 3. స్టెప్ – ఆ గ్రహం ఉన్న సబ్‌లార్డ్ 4. స్టెప్ – ఆ సబ్‌లార్డ్ ఉన్న నక్షత్రాధిపతి. ఇపుడు దీనిని వివరిస్తాను.

1. గ్రహము తన స్వస్థానమునకు, తానున్న భావానికి అది సిగ్నిఫికేటర్ అవుతుంది. ఆ గ్రహం యొక్క 3 నక్షత్రాలలో ఏ గ్రహమూలేనట్లయితే ఆ గ్రహం తానున్న భావానికి "ప్రిన్సిపల్ సిగ్నిఫికేటర్" అవుతుంది. అంటే ప్రముఖ కారకుడన్నమాట.

ప్రతీ గ్రహము తన స్వస్థానమునకు ప్రైమరీ సిగ్నిఫికేటర్ అవుతుంది. అయితే ఆ స్థానములో ఇతర ఏ గ్రహములూ లేనట్లయితే ప్రైమరీ సిగ్నిఫికేటర్ స్థాయి పెరిగి ప్రిన్సిపల్ సిగ్నిఫికేటర్ అవుతుంది. ఒకవేళ ఏ గ్రహమైనా ఆ స్థానంలో ఉంటే, ఆ భావాధిపతి సెకండరీ సిగ్నిఫికేటర్ అని వ్యవహరిస్తారు.

గ్రహముయొక్క నక్షత్రాలలో ఇతర గ్రహముండి, గ్రహముయొక్క స్వస్థానములు ఖాళీగాయున్ననూ ఆ గ్రహము సెకండరీ సిగ్నిఫికేటరే అవుతుంది.

ఏ గ్రహమైన తన నక్షత్రంలోనే ఉంటే ఆ గ్రహము తానున్న భావానికి ప్రైమరీ సిగ్నిఫికేటర్ అవుతుంది. ఇతర గ్రహములు అదే నక్షత్రములలోనున్న అది ప్రైమరీ సిగ్నిఫికేటరే అవుతుంది. ఒకవేళ ఆ గ్రహముయొక్క స్వస్థానములు ఖాళీగా యుండి ఏ గ్రహము అచట లేకున్నచో ఆ గ్రహము ప్రిన్స్‌పల్ సిగ్నిఫికేటర్ అవుతుంది.

2. మనము ఏ గ్రహమును పరిశీలించుచున్నామో ఆ గ్రహమున్న నక్షత్రాధిపతి.

ఈ స్టెప్‌లో ఈ నక్షత్రాధిపతిని ప్రిన్సిపల్ సిగ్నిఫికేటర్ అంటారు. అయితే అతని స్వస్థానములలో గ్రహములుండరాదు. అపుడు ఈ నక్షత్రాధిపతి తానున్న భావానికి ప్రిన్స్‌పల్ సిగ్నిఫికేటర్ అవుతాడు.

రాహు-కేతువుల విషయం గూర్చి ఇంతకు ముందు వివరించాను. వీరిని గూర్చి పరిశీలించినపుడు లేదా వీరి నక్షత్రాలలో గ్రహములున్నపుడు ముందు రాహు, కేతువులనుగూర్చి చెప్పిన అంశములు పరిగణలోనికి తప్పక తీసుకోవాలి.

3. ఇందు గ్రహముయొక్క సబ్‌లార్డ్ గ్రహించాలి. ఇతడున్న భావము, ఇతని స్వస్థానములు పరిశీలించాలి.

4. ఇపుడు ఆ సబల్‌లార్డ్ ఉన్న నక్షత్రాధిపతిని గ్రహించాలి. ఇతడున్న భావము, ఇతని స్వస్థానములూ పరిశీలించాలి.

ఇక సిగ్నిఫికేటర్స్‌గా గ్రహించే విషయంలో మరొక ముఖ్యవిషయం ఏమిటంటే రెండుమూడు గ్రహములు కలసియున్నపుడు వారు పరస్పరం 3.33 డిగ్రీలలోపు దూరంలో ఉన్నచో వారు తమతో కలసిన గ్రహముయొక్క సిగ్నిఫికేషన్‌ను వారూ గ్రహించి ఆ ఫలితములిస్తారు.

దీనిని ఉదాహరణతో వివరిస్తాను.

ఉదా:- దశానాధుడు - గురుడు

వివాహం ఏ అంతర్దశలో ఎందుకు జరిగింది ? సాధారణంగా 7వ భావ (కస్ప్) సబ్‌లార్డ్‌నకు 2-7-11 భావాలతో లేదా ఆ భావాధిపతులతో లేదా అందున్నవారితో సంబంధం ఉంటేనే వివాహం జరుగుతుంది. వీటికి వ్యయస్థానములైన 1-5-10 స్థానాలతో సంబంధం ఉంటే ఆ సమయంలో వివాహం జరుగదు.

1. స్టెప్-గురుదశ కనుక, గురుడు 12లో ఉన్నాడు. గురుని నక్షత్రంలో రవి ఉన్నాడు. కనుక గురుడు 12 సిగ్నిఫికేటర్‌కాదు.

2. స్టెప్ - గురుడున్న నక్షత్రాధిపతి కేతువు 7లో ఉన్నాడు. ఇది వివాహ భావం కనుక కారకత్వం ఉన్నది.

3. స్టెప్ - గురుడున్న సబ్ అధిపతి శని 7లో ఉన్నాడు. ఇక్కడివరకు వివాహ కారకత్వం ఉన్నా జాతకునికి గురుదశ, గురు అంతర్దశలో వివాహం జరుగలేదు. ఎందుచేతనంటే-

4. స్టెప్ - సబ్ అధిపతి అయిన శని, 6లో ఉన్న బుధుని నక్షత్రంలో ఉన్నాడు కనుక. ఇక దీనిని నాలుగు అంచెలుగా ఇలా చెప్పవచ్చు.

గు 12- కే 7 - శని 7 - బుధ 6

అనంతరం శని అంతర్దశ వచ్చింది. ఈ సమయంలోనూ వివాహం జరుగలేదు. ఎందుచేతనంటే- శ 7 - బు 6 - రా 1 - ర 12

అనంతరం బుధ అంతర్దశ వచ్చింది. ఈ పిరియడ్‌లోనూ వివాహం జరుగలేదు ఎందుచేతనంటే, బు 6 - కు 2/7 - శు 7 - బు 6

అనంతరం కేతు అంతర్దశవచ్చింది. ఈ సమయంలోనూ వివాహం కాలేదు ? కారణం ఏమంటే-కే 7 శ 7/11 - శు 7 - బు 6

తరువాత శుక్ర అంతర్దశ వచ్చింది. ఈ పిరియడ్‌లో వివాహం జరిగింది. ఎందుచేతనంటే - శు 7 - బు 6/6 - గు 12 - కే 7

శుక్రుడున్న నక్షత్రాధిపతి బుధుడు 6లోనూ, సబ్‌అధిపతి గురుడు 12లోనూ వివాహం జరుగనివ్వరు. కాని సబ్ అధిపతి ఉన్న నక్షత్రాధిపతి కేతువు 7లో ఉండటంచేత వివాహం ఈ సమయంలో అయ్యింది. ఫోర్త్ స్టెప్‌లో విషయం ఫలవంతమయింది.

కనుక ఈ ఫోర్‌స్టెప్ థియరీలో ఉత్తరోత్తరా గ్రహముల బలాబలములు, కారకత్వములూ నిర్ధారింపబడతాయి.

వివాహం ఎప్పుడు జరుగుతుంది ? అనే విషయంలో ఈ 4 స్టెప్‌థియరీ చాలాబాగా ఉపయోగపడుతుంది. అలాగే 7వ భావ కస్ప్ స్టార్‌లార్డ్ - సబ్ లార్డ్‌లను కూడా దశాంతర్దశానాధులుగా వచ్చు సమయంలో కూడా కొందరికి వివాహం జరుగుతుంది. దీనినే కస్పల్ రూల్ అంటారు.

7వ భావ సబ్‌లార్డ్, 5వ భావంలో ఉన్న గ్రహం నక్షత్రంలో ఉన్నట్లయితే వారు ప్రేమించి వివాహం చేసుకుంటారు. వివాహ విషయంలో 2వ స్థానం కుటుంబాన్ని 7వ స్థానం చట్టపరమైన వివాహబంధాన్ని 11వ భావం కోరిక నెరవేరడాన్ని సూచిస్తాయి.

ఉదా 4 :- ఈ జాతకుని 7వ సబ్‌లార్డ్ 5లో ఉన్నగ్రహం యొక్క నక్షత్రంలో ఉండటంవల్ల ప్రేమ వివాహం జరిగింది.

7వ భావం సబ్‌లార్డ్ - కేతువు
కే 6 - గు 5 - చ 2 - గు 5

**వైవాహిక జీవితం ఎలా ఉంటుంది ?** అనే విషయాన్ని 11వ భావం తెలియజేస్తుంది. ఈ భావం సబ్‌లార్డ్ - అతడున్న నక్షత్రాధిపతి 2-5-7-11 స్థానాల్లో ఉంటే వైవాహిక జీవితం సుఖప్రదంగా ఉంటుంది.

6-12 స్థానాల్లో ఉంటే భర్యాభర్తలు కలహంతో విడిపోవడం జరుగుతుంది. కేవలం 6వ స్థానంతో సంబంధం ఉంటే భార్యాభర్తలు ఉద్యోగరీత్యాగాని, ఆరోగ్యరీత్యాగాని దూరంగా యుంటారు. కేవలం 12తో సంబంధం ఉంటే భార్యాభర్తలు కలసి ఒకే ఇంట్లో జీవిస్తున్నా వారిద్దరి మధ్యాపడక సుఖం ఉండదు.

8వ స్థానంలో ఉంటే కష్టజీవితం అపవాదులు. 4-6-10 స్థానాల్లో ఉంటే అభిప్రాయాలు అభిరుచులు కలవక రోజూ కలహించుకుంటూ ఉంటారు. కాని విడిపోరు.

ఉదా 5 :- 11 భావం - బు / చ / గు

ఈ జాతకుని 11వ భావ సబ్‌లార్డ్ గురుడు 12లో ఉన్నాడు. ఇది వియోగాన్ని తెలియజేస్తున్నది. భావనక్షత్రాధిపతి చంద్రుడు 3లో ఉండి 8లో ఉన్న 1-6 అధిపతి అయిన కుజుడి నక్షత్రంలో ఉన్నాడు. వీరి వైవాహిక జీవితం అసంతృప్తి కలిగి, కలహంతో విడిపోవడం జరిగింది. 12వ స్థాన సంబంధం వియోగాన్నిస్తుంది.

కనుకనే దశా, భక్తులకు 1-6-10 సంబంధం ఉన్నపుడు ఆ దశాంతర్దశ లలో వివాహం కాదు. మరొక ఉదాహరణ 6 :- జననం-1980.11.6 రాత్రి 12.25; 11వ భావం - బు / కు / బు

సబ్‌లార్డ్ బుధుడు 3లో ఉండి 12వ భావంలో ఉన్న రాహువు నక్షత్రంలో ఉన్నాడు. 11వ భావ నక్షత్రాధిపతి అయిన కుజుడు 10వ భావాధిపతి అయి 4వ భావంలో ఉన్నాడు. 4-10-12 భావాల సంబంధం ఏర్పడింది. వివాహం అయిన ఒక సం॥రంలోనే కలహంతో విడిపోయ్యారు.

కోర్టుద్వారా విడాకులు 1-6-10 భావాల సంబంధమున్న దశాంతర్దశల కాలంలో వస్తాయి. కారణాంతరాలచే విడిపోయి, లేదా ఉద్యోగరీత్యా దూర మైనవారు తిరిగి కలసి ఎప్పుడు జీవిస్తారు ? అన్నవిషయం తెలుసుకోవాలంటే 2-7-11 భావాలు పరిశీలించాలి. ఈ భావ సంబంధ సమయంలోనే వారు కలసి జీవించడం జరుగుతుంది.

## అవివాహిత జాతకం

7వ భావ సబ్‌లార్డ్ 4-6-10-12 భావాలతో సంబంధం కలిగియున్న జాతకులకు వివాహయోగం ఉండదు. ఈ విషయంలో "పునర్భూయోగం" కూడా కొందరి జీవితంలో ఉంటుందని కె.పి. తెలియజేస్తున్నది.

శనికి చంద్రునితో స్టార్‌లోగాని సబ్‌లోగాని సంబంధం ఉంటే అట్టి జాతకులు, వివాహం జరగడానికి ఎన్నో ఆటంకములు, ఇబ్బందులు ఎదు

ర్కొంటారు. నిశ్చితార్థం దగ్గరనుంచీ ఎన్నో ఆటంకములు కలిగే అవకాశం ఉంటుంది. అనుకున్న ముహూర్తానికి పెళ్లి జరుగక మరొక ముహూర్తం పెట్టవలసి వస్తుంది.

ఈ శని,చంద్రుల సంబంధం అది సమసప్తకమైనా కలసి ఒకే రాశిలో అతి దగ్గరగాయున్నా పరస్పరం నక్షత్ర, సబ్‌లలో ఉన్నా అదిపునర్భూయోగ మంటారు. అయితే వివాహమైన తరువాత వీరి వైవాహిక జీవితం చాలా బాగుంటుంది. విడిపోవడం జరుగదు. పునర్భూయోగం ఉన్నదీ తెలుసుకోవా లంటే ముఖ్యమైన సూత్రం దీనిని పరిశీలించండి.

శని 1-3-5-7-10 భావాలలో ఉన్నా, శని చంద్రుడి నక్షత్రం, చంద్రుడి సబ్ లేదా చంద్రుడు శని నక్షత్రం చంద్రుడి సబ్‌లో ఉన్నా దానిని పునర్భూయోగమంటారు.

శని కర్కాటకంలోనూ, చంద్రుడు మకర కుంభాలలోను కూడా కొంత ఆలస్యం ఆటంకం కలుగజేస్తాడు.

ముఖ్యంగా పునర్భూయోగ జాతకులు అనుకొన్న వివాహం జరుగకపోవ డం, ముందువద్దని చెప్పి మరల అదే కావాలని చేసుకోవడం ఈ యోగంలోని మరొక విశేషం.

శని, చంద్రులు ఒకేరాశిలో అతి దగ్గరగా కలసియున్నా ఈ యోగం పడుతుంది. వధూవరుల ఇరువురి జాతకంలోనూ శని,చంద్రుల కలయిక ఉన్నచో వారిరువురికీ మాత్రం వివాహం కాదు.

ఈ సమయంలోనే గమనించవలసిన మరొక విషయం ఏమిటంటే కుజుడు, చంద్రుడి సబ్‌లో ఉన్నచో జీవిత భాగస్వామి అహంకారి పొగరుబోతు అని తెలుసుకోవాలి.

పునర్భూయోగం వల్ల వివాహం ఆలస్యం కావడం వివాహం జరుగ డానికి ఆటంకములు కలగడం వంటివే ఏర్పడతాయి. కాని వివాహం కాకుండా ఉండదు. అంతేగాక పునర్భూ జాతకులు వివాహమైన తరువాత అన్యోన్యంగా సుఖంగా ఉంటారు.

అవివాహ యోగానికి కేవలం 7వ భావ సబ్‌లార్డ్ 4-6-10-12 భావాలతో సంబంధం కలిగి యుండటమే కారణం.

7వ భావ సబ్‌లార్డ్ 5-7-11 భావాలతో సంబంధం ఉంటే సాధారణ వివాహ వయస్సులోనూ, లేదా కొంత తొందరగా వివాహం జరుగుతుంది.

7వ భావ సబ్‌లార్డ్ 1-3-4-5-8-9-10 భావాలతో సంబంధం ఉంటే వివాహం ఆలస్యంగా జరుగుతుంది. వీరికి 28-35 సం॥ల మధ్య వివాహం అవుతుంది. సప్తమ భావ సబ్‌లార్డ్ 5-7-11 భావాలతో సంబంధం ఉంటే వైవాహిక జీవితం సుఖప్రదంగా ఉంటుంది.

## మరిన్ని విశేషాలు

7వ భావసబ్‌లార్డ్ 1-3-6-10 భావాలతో సంబంధం ఉంటే వారికి మనశ్శాంతి ఉండదు.

7వ భావసబ్‌లార్డ్ 4-10 భావాలతో సంబంధం ఉంటే, ఎప్పుడూ కలహించుకుంటూ ఉంటారు. కాని విడిపోరు.

7వ భావసబ్‌లార్డ్ 3-9 ఉద్యోగరీత్యా గాని, కారణాంతరాల వల్లగాని తరచూ దూరంగా జీవిస్తారు.

7వ భావసబ్‌లార్డ్ 5-8 భావాలతో సంబంధం ఉంటే దంపతులు ఒకరి నొకరు నాశనం చేసుకుంటారు.

7వ భావసబ్‌లార్డ్ 6-8-12 భావాల సంబంధం ఉంటే కోర్టుద్వారా విడాకులు పొందుతారు.

7వ భావసబ్‌లార్డ్ 6-12 భావాల సంబంధంవల్ల విడాకులు కావాలని ఇద్దరూ కోర్టుకు దరఖాస్తుచేసి వాటిని పొందుతారు. ఇద్దరి ప్రమేయం ఉంటుంది.

7వ భావసబ్‌లార్డ్ 8-12 భావాల సంబంధంవల్ల భార్యే విడాకులు కావాలని కోరుతుంది.

7వ భావసబ్‌లార్డ్ 3-6-9-12 భావాల సంబంధంవల్ల ఇద్దరూ పునర్వివాహం చేసుకుంటారు.

7వ భావసబ్‌లార్డ్ 1-3-9-12 భావాల సంబంధంవల్ల తరచూ ప్రయాణాలవల్ల దంపతులు దూరంగా ఉంటారు. పడకసుఖం తక్కువగా ఉంటుంది.

7వ భావసబ్‌లార్డ్ 2-4-6-10-12 భావాల సంబంధంవల్ల పరస్పరం కలహించుకొని విడిపోతారు.

7వ భావసబ్‌లార్డ్ కేవల 9వ భావంతో సంబంధం ఉంటే వివాహమైన వారిని వివాహం చేసుకుంటారు.

7వ భావసబ్‌లార్డ్ 2-7-8-9 భావాలతో సంబంధం ఉంటే విధవా వివాహంగాని, భర్తను లేదా భార్యను విడిచిపెట్టినవారితో వివాహం జరుగుతుంది. ఇట్టి జాతకంలో శని, రాహు గ్రహంయొక్క సంబంధం తప్పనిసరిగా ఉండాలి. లేనిచో జరుగదు.

7వ భావసబ్‌లార్డ్ 8 భావసంబంధంవల్ల అసంతృప్తి జీవితం. అన్యోన్యత ఉండదు. కొంతకాలం విడిపోతారు.

7వ భావసబ్‌లార్డ్ 8-12 భావాల సంబంధంవల్ల బలవంతంగా లేదా తప్పనిసరి పరిస్థితుల్లో వివాహం జరుగుతుంది.

7వ భావసబ్‌లార్డ్ 4-11 భావాల సంబంధం ఉంటే బంధువుల వర్గం వారితోనే వివాహం జరుగుతుంది. భాగస్వామి అత్యంత ధనవంతులైయుంటారు.

## రెండవ వివాహం

7వభావం సబ్‌లార్డ్ ద్విస్వభావ గ్రహమై, ద్విస్వభావ రాశియందున్న 2-7-11 సంబంధమున్నచో రెండు లేదా ఎక్కువ వివాహములగును.

2వ భావం సబ్‌లార్డ్ 9వ భావసంబంధముండి 7వ భావమునకు పాపగ్రహ సంబంధమున్ననూ రెండవ వివాహము జరుగును.

కొందరు ఆధునిక కె.పి.పరిశోధకులు, 9వ భావ సబ్‌లార్డ్‌నకు 7-11 భావసంబంధమున్నచో రెండవ వివాహం జరుగునని నిరూపించారు.

9వ భావం సబ్‌లార్డ్ 5-11 భావాలతో సంబంధం ఉంటే భార్య జీవించియుండగానే, మరొక స్త్రీతో వివాహం చేసుకోకుండా జీవించడం జరుగుతుంది.

9 భావ సబ్‌లార్డ్ 5-7-9-11 భావాల సంబంధం ఉన్నచో భార్యను విడిచి పరస్త్రీతోనే కలసి జీవించడం జరుగుతుంది.

9వ భావ సబ్‌లార్డ్ 1-6-7-9-12 భావాల సంబంధంమున్నచో భార్య చెల్లిలినిగాని, మేనరికంగాని రెండవ వివాహం చేసుకుంటాడు.

9వ భావ సబ్‌లార్డ్ 1-7-9-12 భావాల సంబంధమున్నచో భార్యే మరొక స్త్రీని తార్చుతుంది.

9వ భావ సబ్‌లార్డ్ 1-6-9 భావాల సంబంధంవల్ల జాతకుడు రెండో పెళ్ళితో దివాళాతీస్తాడు. పూర్తి ధననష్టం.

9వ భావ సబ్‌లార్డ్ 1-6-8 భావాల సంబంధమున్నచో రెండవ వివాహానంతరం రోగి అవుతాడు.

9వ భావ సబ్‌లార్డ్ 2-11 భావ సంబంధంవల్ల రెండవపెళ్లి వలన ఎంతో అభివృద్ధిని సాధిస్తాడు.

9వ భావ సబ్‌లార్డ్ 5-8 భావ సంబంధంవల్ల అపకీర్తి పొందుతాడు. మనోవ్యధ మిగులుతుంది.

9వ భావ సబ్‌లార్డ్ 5-8-10 ఉద్యోగ నష్టం.

9వ భావ సబ్‌లార్డ్ 5-8-12 రెండవపెళ్లి వలన ధననష్టం

9వ భావ సబ్‌లార్డ్ 3-5-8-12 రెండవపెళ్లి అనంతరం అత్యంత దరిద్రస్థితికి చేరకుంటాడు.

9వ భావ సబ్‌లార్డ్ 1-8-12 నిరంతరం కలహాలు

9వ భావ సబ్‌లార్డ్ 1-10 అభివృద్ధి కలుగుతుంది.

9వ భావ సబ్‌లార్డ్ 3-6-8 భావ సంబంధంచే మనోవ్యాధి

9వ భావ సబ్‌లార్డ్ 4-9-12 రెండవ భార్య ప్రమాదంలో మరణిస్తుంది

9వ భావ సబ్‌లార్డ్ 4-8-9 రెండవ భార్య ఆత్మహత్య

9వ భావ సబ్‌లార్డ్ 7-12 రెండవ భార్య శత్రువు

ఇక 10వ భావ సబ్‌లార్డ్ వలన జీవిత భాగస్వామి జాతకునికి ఎంత దూరం నుంచి ప్రాప్తించునో తెలియును.

10వ భావ సబ్‌లార్డ్ 4వ భావానికి సంబంధం ఉన్నచో అదేపట్టణం, లేదా అదే గ్రామం నుంచి జీవిత భాగస్వామి లభించడం జరుగుతుంది.

10వ భావ సబ్‌లార్డ్ 3వ భావ సంబంధమున్నచో తన నగరానికి సమీప గ్రామం నుండే లభిస్తుంది.

10వ భావ సబ్‌లార్డ్ 3-9 అయితే దూర ప్రాంతం

10వ భావ సబ్‌లార్డ్ 9-12 అయితే విదేశీయం

10వ భావ సబ్‌లార్డ్ 2-4 అయితే తెలిసినవారి నుండి బంధువర్గం నుండి లభిస్తుంది.

ఇక 7వ భావ సబ్‌లార్డ్‌నకు 3వ భావ సంబంధమున్నచో మీడియా ద్వారా అనగా, వార్తాపత్రికలు, ఇంటర్‌నెట్ ప్రకటనల ద్వారా వివాహం కుదురుతుంది.

7వ భావసబ్‌లార్డ్ 5-7 సంబంధమున్నచో ప్రేమించి, పెళ్లి చేసుకుంటారు. 7వ భావ సంబంధంలేనిచో చట్టపరమైన బంధం ఏర్పడదు.

## సంభోగ సుఖం

7వ భావంయొక్క సబ్‌లార్డ్ ఉన్న నక్షత్రాధిపతివల్ల దంపతులు రతి సౌఖ్యం గూర్చి తెలుస్తుంది.

రవి అయినచో - శృంగారంమీద ఆసక్తి ఉండదు

చంద్ర అయినచో - శీఘ్రస్ఖలనం, అయినా సంతృప్తి

కుజ అయినచో - కలహంతో రతి

బుధ అయినచో - అనేకసార్లు

గురు అయినచో - సాధారణం, నీతివంతం

శుక్ర అయినచో - వివిధ భంగిమలతో శృంగారం

శని అయినచో - శృంగారంమీద ఆసక్తి ఉండదు.

రాహు, కేతువులయినచో వీరున్న నక్షత్రాధిపతులను పరిశీలించి నిర్ణయించాలి.

## వయసుతేడా

వధూ వరులమధ్య వయసు అంతరం ఎంత ఉంటుంది అన్న విషయం కూడా 7వ భావంయొక్క సబ్‌లార్డ్ ఉన్న నక్షత్రాధిపతి వలన తెలుసుకోవచ్చు.

రవి అయినచో - 2 సం॥లు తేడా వుంటుంది.

చంద్రుడు అయినచో - ఇంచుమించు సమవయస్కులు

కుజుడు అయినచో - 5 సం॥లు అంతరముంటుంది

బుధుడు అయినచో - కొద్దినెలలు మాత్రమే

గురుడు అయినచో - సుమారు 3 సం॥లు అంతరం

శుక్రడు అయినచో - కొన్ని నెలలు మాత్రమే

శని అయినచో - భాగస్వామి వయసు అధికం

రాహు, కేతువులయినచో వారున్న నక్షత్రాధిపతులను పరిశీలించి తెలుసుకోవాలి.

## మూక ప్రశ్న

కె.పి.విధానంలో సబ్‌లార్డ్ అతిముఖ్యం కనుక జాతకుని జనన సమయం చాలా ఖచ్చితంగా యుండాలి. సమయంగూర్చి అనుమానం వ్యక్తం చేసినట్లయితే ముందుగా దానిని రూలింగ్ ప్లానెట్స్ (ఆర్.పి) ద్వారా జనన సమయాన్ని సరిచేసిన అనంతరమే జాతకపరిశీలన చేయాలి.

ఇక జనన విషయాలు తేదీ సమయం వంటివి లేనపుడు హోరరీ విధానం ద్వారా అనగా 249లోపు ఒక సంఖ్యను అడిగి దానినిబట్టి జాతక చక్రం అనగా ప్రశ్న చక్రంవేసి ఫలిత పరిశీలన చేసినచో అది చాలా ఖచ్చితంగా జరుగుతుంది.

కనుకనే కొందరు పృచ్ఛకులు వారి జాతకము, సమయము సరిగ్గానే యున్నా, కె.పి. ప్రశ్నకు ప్రాధాన్యం ఇచ్చి జ్యోతిష్కుని అడుగుతూ ఉంటారు.

మూక ప్రశ్నఅంటే, పృచ్ఛకుడు జ్యోతిష్యుని వద్దకువచ్చి తనకు ప్రశ్న ఫలితం చెప్పమని అడుగుతాడు. అపుడు 249 సంఖ్యలలోపు ఒక అంకె చెప్పమనగా పృచ్ఛకుడు తన మనసులోనికి వచ్చిన ఒక అంకె చెబుతాడు.

ఆ సంఖ్యవలన పృచ్ఛకుని మనస్సులో ఏ ప్రశ్న ఉన్నది? ఏమి అడుగుటకు వచ్చినాడు? అను విషయము తెలుసుకోవచ్చు. పృచ్ఛకుడు ముందుగా తన ప్రశ్నను చెప్పడు. దీనినే మూకప్రశ్న అంటారు.

ఇది చంద్రునివల్ల తెలుస్తుంది. ఒకవేళ ముందుగా ప్రశ్న అడిగిననూ, అతడు చెప్పిన సంఖ్యవలన, అతడడిగిన ప్రశ్నకూ, ప్రశ్నకాలచక్రములోని చంద్ర స్థిత్యాదులూ సరిపోతున్నవో లేదో జ్యోతిష్యవేత్త పరిశీలించుకోవాలి.

ఉదా 7 :- జాతకుడు చెప్పిన సంఖ్య 149.

ఈ సంఖ్యకు తత్కాల చక్రం వేయడం జరిగింది. జాతకుని మనో విషయం చంద్రుడు తెలియజేస్తాడు. ఎలా తెలుసుకోవాలో వివరిస్తాను.

చంద్రుడు - 11వ భావంలో ఉన్నాడు. 9వ స్థానానికి అధిపతి అయ్యాడు. 5వ స్థానాన్ని చూస్తున్నాడు.

చంద్రుడున్న నక్షత్రాధిపతి కుజుడు, 1-6 భావాధిపతి అయి 8లో ఉన్నాడు.

చంద్రుడు గురుని సబ్‌లో ఉన్నాడు. గురుడు 2-5 భావాధిపతిఅయి 9వ భావంలో ఉన్నాడు.

ఇన్ని స్థానాలు సిగ్నిఫికేషన్స్‌లోనికి వచ్చాయి. చంద్రుడున్న సబ్‌ని ముఖ్యంగా గ్రహిస్తే అది గురుడు కనుక అవి 2-5-9 అయ్యాయి. ఇది 5వ భావానికి సంబంధించినది అని తెలుస్తున్నది. అంటే పృచ్ఛకుడు సంతానం విషయం అడగాలని వచ్చాడు.

అంతేగాక 2-11 భావాలు కూడా ఇందు ముఖ్యపాత్రవహిస్తున్నాయి. ఇది రెండవ వివాహాన్ని తెలియజేస్తుంది. అంటే రెండవ వివాహం ద్వారా పుత్రుడు కలుగుతాడా? లేదా ? అన్నవిషయం పృచ్ఛకుని మనసులో ఉన్నది.

ఇదే విషయం అనగా సంతానంగూర్చి అడగడానికి వచ్చారు. అవునా? అని పృచ్ఛకుని ప్రశ్నించినపుడు నిజమేనని అంగీకరించాడు.

పృచ్ఛకుని ఏకైక కుమారుడు బ్లడ్ క్యాన్సర్‌వల్ల మరణించాడు. భార్యకు వయసు మీరినది వంశాభివృద్ధికై మరొక వివాహం చేసుకోదలచి అది ఫలవంత మవుతుందా? లేదా ? అని తెలుసుకోవాలని వచ్చాడు. అదీ విషయం.

ఇవన్నీ అతడు చెప్పిన సంఖ్యవల్ల వేసిన ప్రశ్న చక్రఫలితంవల్ల తెలిసినవే. పృచ్ఛకుని మనసులో నిజంగా ప్రశ్నపై జిజ్ఞాస ఉండి, అడిగినపుడే అది

చెప్పడం సులభతరమవుతుంది. కేవలం ఆషామాషీగా గాని, జ్యోతిషవేత్తను పరిహసిద్ధామనిగాని ప్రశ్నించరాదు. చంద్రుని స్థితివల్లనే మూకప్రశ్నగాని, పృచ్ఛకుని లిఖిత ప్రశ్నగాని ఖచ్చితంగా ఆయా భావాలకు సంబంధించి ఉంటుంది.

అలాలేనిచో ఆ ప్రశ్న చెప్పరాదు. పృచ్ఛకుని కోరిక తీరుతుందా? లేదా? అన్నవిషయం 11వ భావ సబ్‌లార్డ్‌ననుసరించి వుంటుంది.

ప్రశ్న చక్రంలో 11వ భావ సబ్‌లార్డ్ వక్రించియుండకుండా, వక్రించిన గ్రహంయొక్క నక్షత్రంలో లేకుండా ఉన్నప్పుడే ఆ ప్రశ్న ఫలిస్తుంది.

ఇక ఎంతకాలంలో ఆ కోరిక తీరుతుంది అన్నవిషయంలో ఆ భావం అనగా 11వ భావంయొక్క సబ్‌లార్డ్ తీవ్రగతిగల గ్రహమా? (ఫాస్ట్ మూవింగ్ ప్లానెట్) మందగతిగల గ్రహమా? (స్లో మూవింగ్ ప్లానిట్) అన్నది ముందుగా పరిశీలించాలి.

1. ఫాస్ట్ మూవింగ్ ప్లానెట్ అయితే అనగా (రవి, చంద్ర, బుధ, శుక్రులు) చరరాశిలో ఉన్నచో - ఆ పని కొద్ది గంటలలోనేసిద్ధిస్తుంది. స్థిర రాశిలో ఉన్నచో - ఆ పని కొద్ది రోజులలోనే జరుగుతుంది. ద్విస్వభావ రాశిలో ఉన్నచో ఆ విషయం కష్టతరమై కొద్దినెలలో జరుగుతుంది.

2. స్లో మూవింగ్ ప్లానెట్ అయితే (గురు,శని, రాహు,కేతువులు) చర రాశిలో ఉన్నచో - రోజులలో అవుతుంది. స్థిరరాశిలో ఉన్నచో - నెలలలో అవుతుంది. ద్విస్వభావరాశిలో ఉన్నచో - ఇది నిర్ణయించడం చాలా కష్టతరమని గ్రహించాలి. సుమారు 1 సం॥ లేదా అంతకంటే ఎక్కువ కాలం పట్టవచ్చు. సమయ నిర్ధారణలో ఇటువంటప్పుడు (గురు, రవి, చంద్ర, లగ్నము) గోచారంలో భవిష్యత్తులో 11వ భావ నక్షత్ర, సబ్‌లకు, ప్రశ్నకాల లగ్నములకు దశా-అంతర్దశా భుక్తులకు అనుసంధానమైన కాలం నిర్ణయించాలి.

సంవత్సర నిర్ధారణలో గురుగ్రహము లేదా శనిగ్రహము గోచారంలో సంబంధిత భావాలకు చేరుకుంటుంది.

నెలనునిర్ణయించడానికి రవి సంచారం వల్ల తెలుస్తుంది.

రోజునునిర్ధారించడానికి చంద్ర సంచారం తెలియజేస్తుంది. ఇక గంటలను సైతం చెప్పాలంటే ఆ సిగ్నిఫికేటర్ యొక్క లగ్నం తెలియజేస్తుంది.

## ప్రమాదాలు ఎప్పుడు జరుగుతాయి ?

జాతకచక్రంలోగాని, ప్రశ్న చక్రంలోగాని 4-8-12 భావాల సబ్‌లార్డ్‌ల సామూహిక సమయం జరుగుతున్నప్పుడు అనగా ఆ దశా అంతర్దశా విదశా కాలంలో అనుకోని వాహన ప్రమాదములు ఎత్తునుంచి పడటం మొ॥ ప్రమాదాలు సంభవిస్తాయి.

4-8-12 భావాల సబ్‌లార్డ్‌లకు 1-5-9-11 భావములతో సంబంధం ఉన్నా, 1-5-9-11 భావాలకూ వారు సబ్‌లార్డ్ అయినా జాతకుడు ప్రమాదం జరిగిననూ ప్రాణాపాయం లేకుండా స్వల్పగాయాలతో, లేదా ఏ గాయమూ లేకుండా బయటపడటం జరుగుతుంది.

అదే 4-8-12 సబ్‌లార్డ్‌లకు 2-7 భావాలకు సంబంధముండి, బాధక స్థానముయొక్క సంబంధము కూడాయున్నచో జాతకుడు ఆ ప్రమాదంలో మరణించడం జరుగుతుంది.

4వ భావం వాహనం - భవనం మొ॥

8వ భావం ప్రమాదం, హఠాత్ సంఘటన

12వ భావం హాస్పటల్, మంచంపై స్థితి

5-9 భావములు చికిత్స - కోలుకోవడం తెలియజేస్తాయి.

దశాంతర్దశా విదశా నాధులకు 4-8-12 భావాల సబ్‌లార్డ్ లేదా భావాధిపతుల సంబంధం కూడినపుడు అనుకోని ప్రమాదములు సంభవిస్తాయి.

ఈ ప్రమాదాలు ఎప్పుడు జరుగుతాయి ? అంటే 4-8-12 భావాల సబ్‌లార్డ్‌ల, రాశి-నక్షత్రములలో చంద్రుడు సంచరించినపుడు 4-8-12 లగ్నములలో ప్రమాదాలు సంభవిస్తాయి.

ఉదా 8 :- 4వ భావం సబ్‌లార్డ్ శుక్రుడు; 8వ భావం సబ్‌లార్డ్ బుధుడు; 12వ భావం సబ్‌లార్డ్ గురుడు.

ఈ జాతకునికి దశాంతర్దశా విదశలు ఇలా జరుగుతున్నాయి. గురు దశ శుక్రాంతరం బుధవిదశ ఈ సమయంలో చిన్నప్రమాదం జరుగుతుందని ముందుగా హెచ్చరించడం జరిగింది.

అయినా ఒకరోజు ఈ జాతకుడు మద్యంసేవించి, బైక్ నడుపుతూ ప్రమాదానికి గురైనాడు. పెద్దగా దెబ్బలు ఏమీ తగలలేదు. ఆరోజు చంద్రుడు రేవతీ నక్షత్రం. (బుధుడు)లో సంచరిస్తున్నాడు. జరిగినసమయానికి ధనుర్లగ్నం (గురుడు) నడుస్తున్నది.

ధనుర్లగ్నంలో పూర్వాషాఢ నక్షత్రం (శుక్రుడు) జరుగుతున్నది. ఈ విధంగా గోచారంలో కూడా 4-8-12 భావ సబ్‌లార్డ్లయిన శుక్ర, బుధ, గురుల సమన్వయం జరిగింది.

ఇదే జాతకునికి చిన్నతనంలో శుక్రదశ, బుధ అంతర్దశ, గురువిదశలో మేడమెట్లపైనుంచి జారిపడి ఎడమచేయి కొద్దిగా విరిగినదట. ఈవిషయం జాతకుని తండ్రి తెలియజేశారు. డైరీలో ఆడేట్, సమయం పరిశీలించగా ఆ సమయం కూడా ధనుర్లగ్నం పూర్వషాఢ నక్షత్రమే అయ్యాయి.

4-8-12 భావాల సబ్‌లార్డ్ల సమయంలో అందరికీ ప్రమాదం జరుగుతుందా? లేదా కొందరికేనా? అనే విషయం ఎలా తెలుస్తుంది అంటే-

4-8-12 భావాల సబ్‌లార్డ్ గ్రహాల రాశులలో వారివారి నక్షత్రాలుంటేనే, ఆయా సమన్వయ సమయాలలో ప్రమాదం జరుగుతుంది. లేకపోతే జరుగదు.

ఇపుడు చెప్పిన జాతకుని విషయమే ఉదాహరణగా తీసుకుందాం. ఇచట 4-8-12 భావాల సబ్‌లార్డ్లు వరుసగా శుక్ర, బుధ, గురులు వచ్చారు. వీరి రాశులలో వీరిలో ఎవరో ఒకరి నక్షత్రం ఉండాలి. అపుడు గోచారంలో ఆ సమయం వచ్చినపుడు, దశ, అంతర్దశ, విదశ నడుస్తున్నప్పుడు మాత్రమే ప్రమాదాలు జరుగుతాయి. లేకపోతే జరుగవు.

ఈ ఉదాహరణ జాతకంలో 4-శుక్రుని రాశులైన వృషభ, తులలలో శుక్ర, బుధ, గురు నక్షత్రములు లేవు.

8- బుధుని రాశులైన మిధున, కన్యారాశులలో, మిధునంలో గురుని నక్షత్రం పునర్వసు ఉన్నది. కన్యలో లేదు.

12 - గురుని రాశులైన ధనుర్మీన రాశులలో ధనుర్మీన రాశులలో ధనస్సులో శుక్రుని నక్షత్రమైన పూర్వాషాఢయున్నది. మీనరాశిలో బుధుని నక్షత్రమైన రేవతి యున్నది.

కనుక ప్రమాదము తప్పక జరుగుటకు గోచారములో అవకాశమున్నట్లు తెలిసినది. అదేవిధముగా దశాంతర్దశా విదశలలో గురు, శుక్ర, బుధులు జరుగుతున్న సమయంలో, రేవతీ నక్షత్రంరోజున, ధనుర్లగ్నం పూర్వాషాఢ సమయంలో వాహన ప్రమాదం జరిగింది.

ఈవిధంగా చాలా ఖచ్చితంగా సునిశితంగా పరిశీలించి ప్రమాదాలు గూర్చి తెలుసుకోవచ్చు.

4-8-12 భావాల సబ్‌లార్డ్ గ్రహాల రాశులలో ఏ ఒక్కరి నక్షత్రమూ లేనిచో అట్టి జాతకుడు జీవితంలో ఏవిధమైన ప్రమాదానికీ గురికాడు.

1-5-9 భావాల సబ్‌లార్డ్ గ్రహాల రాశులలో 1-5-9 సబ్‌లార్డ్ గ్రహా లున్నచో అది రక్షణ కవచంగా యుంటుంది. కనుక 1-5-9 భావాల సబ్ లార్డ్ గ్రహాల రాశులలో ఏ ఒక్కరి నక్షత్రమైనా ఉండితీరాలి. అలా ఉన్నవారి జాతకంలో 4-8-12 భావాలవల్ల ప్రమాదం ఉన్ననూ ప్రమాదంలోవారికి శరీరంపై చిన్న గీరు కూడాపడదు.

శని, శుక్రులు 4-8-12 భావాల సబ్‌లార్డ్ లయినచో, అట్టి జాతకునకు జీవితంలో ఏవిధమైన ప్రమాదములూ జరుగవు. ఎందుచేతననగా శనిరాశు లైన మకర, కుంభములలో శుక్రగ్రహము యొక్క నక్షత్రములు లేవు. అలాగే శుక్ర గ్రహ రాశులైన వృషభ తులలందు శనిగ్రహముయొక్క నక్షత్రములులేవు.

అలాగే 1-5-9 భావముల సబ్‌లార్డ్ బుధ, గురు, రవులైనచో అట్టి జాతకులకు అసహజ మరణముండదు.

ఈవిధంగా 4-8-12 భావాల సబ్‌లార్డ్‌ల వలన జాతకుని ప్రమాదము లను తెలుసుకోవచ్చు.

## గోచార ప్రాముఖ్యత

వర్తమాన దశానాధుడు గోచారంలో సంబంధిత భావగ్రహముల నక్షత్రములలో సంచారము చేయునపుడు మాత్రమే ఆయా భావములు ఫలిస్తాయి.

ఒకవేళ అలా సంచారము సంభవించని కాలమునందు దశాంతర్దశలు ఆయా భావఫలితమును సూచించుచున్ననూ అది ఫలవంతము కాదని తెలియుచున్నది.

ఉదా 9 :- చతుర్థభావం సబ్‌లార్డ్ వల్ల స్వంతంగా గృహం, వాహనం, భూములు కొనడం తెలియజేస్తుంది. ఈ జాతకునికి కేతుదశ జరుగుతున్నది. 2-4-11, స్థిరరాశులవల్ల గృహం కొనడం తప్పనిసరిగా జరుగుతుందని తెలిసింది. ఏ అంతర్దశలో జరుగుతుందో పరిశీలించగా ప్రస్తుతం నడుస్తున్న రాహువు అంతర్దశ అనుకూలంగా యున్నట్లు ఇందువలన తెలుస్తున్నది.

రా 12 - బు 6 / 4-7 - కు 5 - బు 6/4-7

ఇలా రాహు అంతర్దశ ఫోర్‌స్టెప్ థియరీవల్ల గృహమును కొనడం జరుగుతుందని వెల్లడిస్తున్నది.

కాని అది జరుగలేదు. కారణం పరిశీలించగా దశానాథుడైన కేతువు 12వ భావ సిగ్నిఫికేటర్ అయిన రవి నక్షత్రంలో గోచారరీత్యా సంచరిస్తున్నాడు. తరువాత వచ్చిన గురు అంతర్దశలో గృహం కొనడం జరిగింది. ఇది పరిశీలించగా- గు 10 - ర 6/6 - రా 12 - బు 6/4

ఫోర్‌స్టెప్ థియరీ రీత్యా అనుకూలముగానే యున్నది. (గురుని సబ్‌లార్డ్ అయిన రాహువు, బుధుని నక్షత్రంలో ఉన్నాడు. బుధుడు 6లో ఉన్నాడు. బుధుని ఆధిపత్యరాశులు 4-7 అయినవి. 7వ భావములో గ్రహములుండుటచే అదిపూర్తి సిగ్నిఫికేషన్ కాదు. ఇక 4వ భావములో ఏ గ్రహములూ లేవు. అందువలన బుధుడు 4వ భావమునకు బలమైన సిగ్నిఫికేటర్ అయి, ఆ అధికారము గురునకు సంక్రమించినది.)

ఇక గోచారములో దశానాథుడైన కేతువు, గురు, రాహు నక్షత్రముందు సంచరించుచున్నాడు. ఈ సమయమునందే అనగా కేతుదశ గురు అంతర్దశలో గృహం కొనడం జరిగింది.

ఈ విధంగా ఫలితములు నిర్ణయించి చెప్పునపుడు, దశనాథుని గోచారము ఏ నక్షత్రములందు జరుగుచున్నదో, వారి సిగ్నిఫికేషన్ ఏమిటో పరిశీలించుట వలన నూరుశాతం ఫలితములను ఖచ్చితముగా చెప్పవచ్చు.

సిగ్నిఫికేటర్స్‌గా 9 గ్రహములు వచ్చిననూ, వాటిలో రూలింగ్ ప్లానెట్స్ ద్వారా ముఖ్య ఫలితమునిచ్చు గ్రహములను అతిసులభముగా గుర్తించవచ్చు. ఈ రూలింగ్ ప్లానెట్స్ గ్రహములను ముందుగానే నిర్ధారించు కొనవలయును. ఫలితముచెప్పు సమయము నందు కాదు. జాతకము పరిశీలనకు తీసుకొన గానే రూలింగ్ ప్లానెట్స్ నోట్ చేసుకోవాలి. అంతా అయిన తరువాత చివరగా కాదు. ఇది ముఖ్యముగా గుర్తుంచుకోవలసిన విషయం.

## దశాంతర్దశల గోచారకాలం

దశానాధుని, అంతర్దశా నాధుని నక్షత్రాధిపతులు రాశులలో ఉన్నపుడు, ఆయా రాశులలో రవి, లేదా ఇతర గ్రహములు, సిగ్నిఫికేటర్స్ సంచరించు నపుడు సంబంధిత భావ ఫలితములు జరుగును.

ఈ క్రింది పట్టికలో దశాంతర్దశల సమయంలో ఏ నెలలో ఏ తేదీల మధ్య ఫలితము జరుగునో కొన్ని వివరించడమైనది.

ఉదా 10:- ఈ జాతకునికి శని మహాదశలో గురు అంతర్దశ జరుగు తున్నది. జాతకచక్రములో రెండవ కుమారునికి సంబంధించి సిగ్నిఫికేషన్స్ శని, గురులకు పట్టినవి. శని, గురులకు సంబంధించిన నక్షత్రములో అనగా కుంభరాశిలో పూర్వభాద్ర నక్షత్రములో రవి సంచరించు కాలములో అనగా-

శ - గు - మార్చి 3 - మార్చి 16 మధ్యలో మార్చి 12వ తేదీన రెండవ కుమారునికి వివాహము జరిగినది.

ఈవిధముగానే ఈ క్రింది పట్టిక ద్వారా సమయ నిర్ధారణ చేయవచ్చు. **ముందుగా దశాంతర్దశానాథుల సిగ్నిఫికేషన్స్ మాత్రము తప్పక గమనించాలి.**

| | | |
|---|---|---|
| శ - ర | జనవరి 14 | 23 |
| శ - చ | జనవరి 24 | ఫిబ్రవరి 4 |
| శ - కు | ఫిబ్రవరి 5 | 17 |
| శ - రా | ఫిబ్రవరి 18 | మార్చి 2 |
| శ - గు | మార్చి 3 | మార్చి 6 |
| శ - గు | మార్చి 7 | మార్చి 16 |
| గు - గు | మార్చి 17 | మార్చి 27 |
| గు - బు | మార్చి 28 | ఏప్రియల్ 13 |

| | | |
|---|---|---|
| కు - కే | ఏప్రియల్ 14 | ఏప్రియల్ 26 |
| కు - శు | ఏప్రియల్ 27 | మే 9 |
| కు - ర | మే 10 | మే 13 |
| శు - ర | మే 14 | మే 23 |
| శు - చ | మే 24 | జూన్ 6 |
| శు - కు | జూన్ 7 | జూన్ 13 |
| బు - కు | జూన్ 14 | జూన్ 20 |
| బు - రా | జూన్ 21 | జూలై 3 |
| బు - గు | జూలై 4 | జూలై 13 |
| చ - గు | జూలై 14 | జూలై 17 |
| చ - శ | జూలై 18 | జూలై 31 |
| చ - బు | ఆగస్టు 1 | ఆగస్టు 13 |
| ర - కే | ఆగస్టు 14 | ఆగస్టు 26 |
| ర - శు | ఆగస్టు 27 | సెప్టెంబర్ 9 |
| ర - ర | సెప్టెంబర్ 10 | సెప్టెంబర్ 13 |
| బు - ర | సెప్టెంబర్ 14 | సెప్టెంబర్ 23 |
| బు - చ | సెప్టెంబర్ 24 | అక్టోబర్ 6 |
| బు - కు | అక్టోబర్ 7 | అక్టోబర్ 13 |
| శు - కు | అక్టోబర్ 14 | అక్టోబర్ 20 |
| శు - రా | అక్టోబర్ 21 | నవంబర్ 3 |
| శు - గు | నవంబర్ 4 | నవంబర్ 13 |
| కు - గు | నవంబర్ 14 | నవంబర్ 17 |
| కు - శ | నవంబర్ 18 | నవంబర్ 30 |
| కు - బు | డిశంబర్ 1 | డిశంబర్ 13 |
| గు - కే | డిశంబర్ 14 | డిశంబర్ 26 |
| గు - శు | డిశంబర్ 27 | జనవరి 9 |
| గు - ర | జనవరి 10 | జనవరి 13 |

# కేవలం సబ్‌లార్డ్ వల్ల ఫలితం

సాధారణంగా సంతానం ఉందా ? లేదా ? ఉంటే ఎప్పుడు? అనేది కె.పి. విధానంలో చాలా స్పష్టంగా తెలుసుకోవచ్చు.

5వ భావ సబ్‌లార్డ్‌నకు 2-5-11 భావాలతో సంబంధం ఉన్నా, అందున్న గ్రహముల నక్షత్రంలో ఉన్నా జాతకునికి తప్పకుండా సంతానం కలుగుతుంది. అది ఎప్పుడు ? అనేది 2-5-11 భావములందున్న గ్రహ ములు లేదా వారి నక్షత్రాలలో ఉన్నగ్రహముల దశాంతర్దశా విదశలలో సంతానం కలుగుతుంది. అయితే 5వ భావ సబ్‌లార్డ్‌నకు 1-4-10 సంబంధ ముండరాదు. అయితే ఈ క్రింది ఉదాహరణ జాతకంలో 5వ భావసబ్‌లార్డ్ నకు 2-5-11 భావాల సంబంధం లేదు. అయినా సంతానం కలిగింది. ఎందుచేత ?

ఉదా 11 :- 5వ భావసబ్‌లార్డ్ కేతువు. ఈ కేతువు 1-4-10 భావా లతో సంబంధమున్నది. 2-5-11 భావాల సంబంధంలేదు. అదీగాక కేతు గ్రహము స్వభావరీత్యా అబార్షన్ (గర్భస్రావం) కలిగించును.

అయినా ఈ జాతకునికి సంతానం ఎందువలన కలిగినది? అంటే, కేతువు 5వ భావసబ్‌లార్డ్ మాత్రమేగాక 11వ భావమునకు కూడా సబ్‌లార్డే అయ్యాడు. కేతువు నక్షత్రములైన అశ్వని, మఖ, మూలలందు ఏగ్రహములేదు. అందుచేత 5-11 భావముల సబ్‌లార్డ్ అయిన కేతువే ఆ భావఫలితమును అనగా సంతానమును ఇచ్చినాడు.

ఇందువలన తెలుసుకోవలసినది ఏమనగా ఏ భావమునకైననూ ఆ భావ సబ్‌లార్డ్ ఆ భావ ఫలితములను తన మూడు నక్షత్రములలో ఏ గ్రహమూ లేనపుడు తానే స్వయంగా ఇచ్చును.

# గ్రహదృష్టులవల్ల మారే ఫలితాలు

ఆకాశంలో గ్రహపరిధులు ఇలా ఉన్నాయి. ముందుగా సూర్యుడు, సూర్యుని చుట్టూ బుధుని పరిధి ఉన్నది. తరువాత వరుసగా శుక్రుడు, చంద్రునితో కలసిన భూమి, కుజుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో గ్రహపరిధులు ఉన్నవి.

భూమికి వెలుపలనున్న గ్రహములు అన్నీ "ఔటర్ ప్లానెట్స్" అంటారు. వీటిలో కుజ, గురు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోలు వస్తాయి.

మనం కె.పి. విధానంలో ఫలితం పరిశీలించేటపుడు కుజ, గురు, శనుల ప్రభావం ఎంతో ఉంది యురేనస్, నెప్ట్యూన్, ప్లూటోలను కూడా గ్రహించవచ్చు కాని వాటి ప్రభావంపై పూర్తి అవగాహనలేదు. ఎక్కువగా వీరున్న స్థానములను గూర్చియే ఫలితములు వివరించబడ్డాయి. వీరి దృష్టు లను గూర్చి నిర్ధారణలేదు.

జాతకుని జాతకచక్రములో కుజ, గురు, శనులువారున్న స్థానమును బట్టి, నక్షత్రములనుట్టి ఫలితములను నిర్ణయించుట అందరికీ తెలిసినదే. కాని వీరి దృష్టి ఇతర గ్రహములపై పడినపుడు ఆ గ్రహములు తమ బలమును కోల్పోతాయి.

ఔటర్‌ప్లానెట్స్ అయిన కుజ, గురు, శనుల దృష్టి, ఇన్నర్ ప్లానెట్స్ అనబడే చంద్ర, శుక్ర, బుధులపై పడిపుడు, దృష్టివల్ల చంద్ర, శుక్ర, బుధులు బలహీనులవుతారు. అయితే గురుని దృష్టి మాత్రము శుభదృష్టి కావున, గురు దృష్టి పొందిన ఇన్నర్‌ప్లానెట్స్ చెడు ఫలితములను ఇవ్వవలసివస్తే వాటి తీవ్రత చాలామేర తగ్గిపోతుంది.

ఔటర్‌ప్లానెట్స్ అధీనంలోనే ఇన్నర్ ప్లానెట్స్ ఉంటాయి. మరొక విశేషమేమిటంటే ఔటర్ ప్లానెట్స్‌కు విశేష దృష్టులున్నాయి. ఇన్నర్ ప్లానెట్స్‌కు కేవలం సప్తమదృష్టి మాత్రమే ఉన్నది.

విశ్వంలోప్రతీ గ్రహమూ కొంత కాస్మిక్ కిరణప్రసారం చేస్తున్నవి. శని గ్రహము తన కాస్మిక్ రేడియేషన్‌లో గంధకం (సల్ఫర్) ప్రసరించుచున్నది. ఇది 3-10 దృష్టివలన, దృష్టిపొందిన గ్రహము చెడిపోయి మంచి ఫలిత మివ్వలేదు.

గురుగ్రహము యొక్క దృష్టిలో ఏవిధమైన విషకిరణ ప్రసాదమూలేదు. ఇదిచల్లని మలయమారుతము వంటిది. జీవకారకము కనుకనే గురుగ్రహము నకు "జీవ" అనిపేరు ఉన్నది. గురుని దృష్టి సంజీవని వంటిది.

కుజుని దృష్టిలో అగ్నితత్వమున్నది కుజుని 4-8 ప్రత్యేక దృష్టులు ఎంతో ప్రభావము కలవి.

గురుని సప్తమ దృష్టి కుజ, శనులపైబడిననూ వారి చెడును తగ్గించలేదు. గురుని 5-9 ప్రత్యేక దృష్టి పడినచో కుజ, శనుల చెడు ప్రభావము చాలా మేర తగ్గిపోవును. కాని కుజ, శనుల సప్తమ దృష్టి పొందిన గురుడు తన శుభత్వమును కొంతమేర కోల్పోవును. అదీ విశేషం.

# చంద్ర నక్షత్ర ఫలితములు

1. జన్మనక్షత్రం - అనగా చంద్రుడున్న నక్షత్రం జన్మలగ్నాధిపతి నక్షత్ర మైనచో జాతకుడు ఎక్కువగా తన గురించే ఆలోచించును. తన ఆయుర్దాయము, తనసుఖము, తనశరీరముగూర్చి ఆలోచించును. చంద్రుడు మనసును తెలియజేయును. కావున చంద్రుడు ఏ భావాధిపతియొక్క నక్షత్రము నందుండునో జాతకుడు ఆ భావమునకు సంబంధించిన ముఖ్య ఆలోచనలు కలిగియుండును.

2. చంద్రుడు రెండవ భావాధిపతి నక్షత్రము నందున్నచో, జాతకుడు తన కుటుంబము, తన ధనము, తన ముఖము, వాక్కు గురించి శ్రద్ధవహించును.

3. చంద్రుడు మూడవ భావాధిపతి నక్షత్రమునందున్నచో జాతకుడు తన సోదరవర్గము, ప్రయాణములు మొ॥ తృతీయభావ ఫలితములనుగూర్చి నిరంతరము ఆలోచించుచుండును. వీరికి ఎక్కువ కాలము ఇంటియందే యుండుట ఇష్టముండదు. సంచార జీవితము నిష్టపడతారు.

4. చంద్రుడు చతుర్థ భావాధిపతి నక్షత్రమునందున్నచో, విద్య, ఇల్లు, వాహనములు, తల్లి, వరసత్వ సంపద, తన ధనమును గుప్తముగా దాచుటను గూర్చి ఎక్కువగా ఆలోచించును. బంధువర్గము, మిత్రవర్గము గూర్చి కూడా శ్రద్ధ వహించును.

5. చంద్రుడు పంచమ భావాధిపతి నక్షత్రమునందున్నచో కళలు, ప్రేమ, సంతానము, జూదము, సులభముగా ధనము సంపాదించుట, వేదాంతము మొ॥లగు విషయములనుగూర్చి ఆలోచించును.

6. చంద్రుడు ఆరవ భావాధిపతి నక్షత్రము నందున్నచో తాను చేయుచున్న పనినిగూర్చి, శత్రువులను అధిగమనించుటనుగూర్చి, ఋణ, రోగములనుగూర్చి ఆలోచించును. ఆహారము వేడిగా తినుటకు ఇష్టపడును.

7. చంద్రుడు సప్తమభావాధిపతి నక్షత్రమునందున్నచో తన భార్యను గూర్చి, వ్యాపార భాగస్వామినిగూర్చి, సంఘములో తన పలుకుబడి పెంచుకొనుటను గూర్చి ఆలోచించును.

8. చంద్రుడు అష్టమ భావాధిపతి నక్షత్రమునందున్నచో తన మరణము, జీవితము, వేదాంతము గూర్చి ఆలోచించును.

9. చంద్రుడు నవమ భావాధిపతి నక్షత్రమునందున్న, పరిశోధన, ఉన్నతవిద్య తండ్రి, దూరప్రయాణములు మోక్షము పొందుట మొ॥ విషయములను గూర్చి ఆలోచించును.

10. చంద్రుడు దశమ భావాధిపతి నక్షత్రము నందున్న తన పేరు ప్రతిష్ఠలను పెంచుకొనుట, రాజకీయ వ్యవహారములు ఉన్నత పదవులు మొ॥ వాటినిగూర్చి ఆలోచించును.

11. చంద్రుడు ఏకాదశ భావాధిపతి నక్షత్రమునందున్నచో, ప్రాపంచిక సుఖములనుగూర్చి, స్నేహితులనుగూర్చి అన్నగారిగూర్చి లాభము పొందుటను గూర్చి ఎక్కువగా ఆలోచించును.

12. చంద్రుడు ద్వాదశ భావాధిపతి నక్షత్రమునందున్న ఏకాంతముగా ఉండుట ఇష్టపడును. రహస్యమైన పనులు సాగించుచుండును. విదేశీయ వస్తువులు, విదేశీయ నివాసము ఇష్టపడును. దూరప్రాంతనివాసము, సంప్రదాయ వ్యతిరేకతగూర్చి ఆలోచించును.

## జియో సెంట్రిక్

ముఖ్యంగా జాతకచక్రం శాస్త్రీయ విధానంలోవేసేటప్పుడు గమనించ వలసినది జియోసెంట్రిక్ లాటిట్యూడ్ విధానం. సాధారణంగా అక్షాంశ రేఖాంశములను ఆధారం చేసుకొనే లగ్నం నిర్ణయిస్తారు.

అయితే శాస్త్రీయ విజ్ఞానం దినదిన ప్రవర్ధమానమవుతున్న ఈ రోజుల్లో లాటిట్యూడ్ గ్రహించేటప్పుడు, జియోగ్రాఫికల్ లాటిట్యూడ్ గ్రహించరాదని జియోసెంట్రిక్ లాటిట్యూడ్ గ్రహించాలని శాస్త్రజ్ఞులు పరిశోధకులు సూచిస్తున్నారు.

సామాన్యంగా భూమిపై మూడు శక్తిక్షేత్రాలు పనిజేస్తున్నాయి. 1. అయస్కాంత శక్తిక్షేత్రము 2. విద్యుదయస్కాంత క్షేత్రము 3. గురుత్వాకర్షణ లేదా భూమ్యాకర్షణ శక్తిక్షేత్రము.

భూమి ఉపరితలంపైన క్రింద భూమ్యాకర్షణ క్షేత్రము ఉన్నది. కనుకనే పైకి విసిరిన ప్రతీ వస్తువు క్రిందకు లాగబడి పడుతున్నది. ఈ శక్తి ఖచ్చితంగా భూగర్భంలో కేంద్రస్థానమున నిబిడమైయున్నది. దీనినే జియోసెంట్రిక్ స్థానము అంటారు. ఇది భూమికి అన్ని దిశలలోనూ ప్రసరించును. భూతల ముపైనున్న స్థానము జియోగ్రాఫిక్ స్థానము.

జియోగ్రాఫిక్ లాటిట్యూడ్ వలన ఏ నగరము ఎచ్చట? ఎంత? దూర ములో ఉన్నదీ తెలియును. మానవుడు జన్మించిన పిమ్మట అతనిపై భూమ్యా కర్షణశక్తి పనిచేయుట ప్రారంభించును కావున, అతడు పుట్టిన స్థలమునకు జియోసెంట్రిక్ లాటిట్యూడ్‌నే గ్రహించవలెనని ఆధునిక పరిశోధకులు చెప్పు చున్నారు. "జ్యోతిషదీపిక" వంటి కె.పి. సాఫ్ట్‌వేర్ కూడా ఈ సౌకర్యము నేర్పాటు చేసినది.

ఒక శిశువు చెన్నైలో జన్మించినపుడు ఆ నగరమునకు

జియోగ్రాఫికల్ లాటిట్యూడ్ $13^0 - 04^1$

జియో సెంట్రిక్ లాటిట్యూడ్ $12^0 - 59^1$

అగును. ఇందు రెండవదైన జియోసెంట్రిక్‌లాటిట్యూడ్ గ్రహించాలని, అపుడు ఖచ్చితమైన సబ్‌లార్డ్ సూచింపబడతాడని పరిశోధకుల అభిప్రాయం.

## ప్రసిద్ధ జాతకము

ఉదా 12 :- కె.పి.జ్యోతిష సిద్ధాంత ప్రవక్త అయిన శ్రీ కె.యస్. కృష్ణ మూర్తిగారి జాతకమిది. పరిశీలించండి.

జననం = 1-11-1908 సమయం : రాత్రి 12.11

పుట్టినస్థలము : తంజావూరు సమీపంలోనితిరువయ్యూరు.

జన్మనక్షత్రం : శ్రవణం, మకరరాశి, జన్మలగ్నం : మకరలగ్నం

ఇక "ప్లాసిడస్" పద్ధతిలో జాతకచక్రం ఇలా ఉన్నది.

| | | | |
|---|---|---|---|
| III 18.19<br>శ 11.59 | IV 19.37 | V 17.21 | రా 5.50<br>VI 13.30<br>నె 24.36 |
| II 14.16 | లాటి 10.48<br>లాంగి 79.15<br>అయనాంశ<br>22.29 | | VII 11.00 |
| చం 11.52<br>1లగ్నం<br>11.00 | | | VIII 14.16<br>గు 16.58 |
| యు21.08<br>XII 13.30<br>కే 5.50 | XI 17.21 | X 19.37<br>ర 15.58<br>బు 8.10 | శు 4.56<br>IX 18.19<br>కు 21.43 |

జననకాల చంద్ర దశాశేషం 8.7.6 రోజులు.

## భావములు

| భావము | నక్షత్రాధిపతి | సబ్‌లార్డ్ |
|---|---|---|
| 1 లగ్నము | చంద్రుడు | చంద్రుడు |
| 2 | రాహువు | బుధుడు |
| 3 | బుధుడు | బుధుడు |
| 4 | శుక్రుడు | రాహువు |
| 5 | చంద్రుడు | శని |
| 6 | రాహువు | బుధుడు |
| 7 | శని | చంద్రుడు |

| | | |
|---|---|---|
| 8 | శుక్రుడు | శుక్రుడు |
| 9 | చంద్రుడు | బుధుడు |
| 10 | రాహువు | కుజుడు |
| 11 | బుధుడు | బుధుడు |
| 12 | శుక్రుడు | శుక్రుడు |

**గ్రహస్థితి**

| గ్రహము | నక్షత్రాధిపతి | సబ్‌లార్డ్ |
|---|---|---|
| రవి | రాహు | శుక్రుడు |
| చంద్ర | చంద్రుడు | కుజుడు |
| కుజ | చంద్రుడు | శుక్రుడు |
| బుధ | రాహువు | రాహువు |
| గురు | శుక్రుడు | చంద్రుడు |
| శుక్ర | రవి | శని |
| శని | శని | చంద్రుడు |
| రాహువు | కుజుడు | చంద్రుడు |
| కేతువు | కేతువు | రాహువు |
| యురేనస్ | శుక్రుడు | గురుడు |
| నెప్ట్యూన్ | గురుడు | బుధుడు |

**కృష్ణమూర్తిగారి జీవితములో కొన్ని ముఖ్య సంఘటనలు :**

1926 ఆగస్టులో కాలేజీలో చదువుచూ, రా1 రాలో స్కాలర్‌షిప్ పొందారు. రా – 4వ భావ సబ్‌లార్డ్, 6వ భావ నక్షత్రాధిపతి అయివున్నాడు.

1927 –7–14న తమిళనాడు ప్రభుత్వ పబ్లిక్ హెల్త్ డిపార్ట్‌మెంటులో ఉద్యోగంలో ప్రవేశించారు. అపుడు రాహుదశ గురుభక్తి (రా/గు)జరుగుతున్నది. గురుడు 10వ భావాధిపతి అయిన శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. ఆ రోజు భుక్తినాధుడైన గురుని వారం. (గురువారం) చంద్రుడు 10వ అధిపతి అయిన శుక్రుని (పూర్వాషాడ) నక్షత్రంలో సంచరిస్తున్నాడు. ఆ నక్షత్రం గురుని రాశిఅయిన ధనుస్సులోనిదే.

రవి సర్వీస్ స్థానమైన మిధునంలో గురుని నక్షత్రంలో, 10వ అధిపతి అయిన శుక్రుని సబ్‌లో సంచరించుచున్నాడు. దశానాధుడైన రాహువు, జన్మ చక్రంలోని మిధున రాహువునకు సమీపంగానే సంచరిస్తున్నాడు. అదీ కుజుని నక్షత్రంలో (జాతకంలో రాహువు, కుజుని నక్షత్రంలో ఉన్నాడు) కుజుడు 10వ భావ సబ్‌లార్డ్‌గా ఉన్నాడు.

జాతకచక్రంలో యురేనస్ 12వ భావంలో గురుని రాశిలోఉండి, గురుని త్రికోణదృష్టి పొంది యుండుటచేత, గొప్ప దివ్యదృష్టి లభించింది. నూతనమైన పద్ధతిని కనుగొనేలా చేసింది.

తన 52వ ఏట జ్యోతిషశాస్త్రంలో ఒక సరికొత్త ఫలిత విధానాన్ని కనుగొన్నారు. వీరి జాతకంలో బుధుడు పరిశోధనా స్థానమైన 9వ భావంలో ఉన్నాడు. అపుడు (కె.యస్.కె) కృష్ణమూర్తి గారికి శనిదశ, శనిభుక్తి జరుగుతున్నది. అటుపిమ్మట, జ్యోతిషశాస్త్ర పరిశోధన తన సిద్ధాంత ప్రచార, బోధన చేయుటకు నిశ్చయించుకొని ప్రభుత్వోద్యోగానికి 1961-9-19 మంగళవారంనాడు స్వచ్ఛందంగా రాజీనామా చేసారు. అపుడు శని దశ బుధభుక్తి జరుగుచున్నది.

కృష్ణమూర్తిగారికి 2 బిరుదులు 1. సోతిడ మన్నన్ 2. జ్యోతిషమార్తాండ అనేవి లభించాయి. గురు, శుక్రులు 18 డిగ్రీల దూరంలో (వెజింటైల్‌దృష్టి) ఉంటే జాతకుడు బిరుదులు పొందుతాడు.

1963-3-20 బుధవారంనాడు, అస్ట్రాలజీ & అదృష్ట అనే ఇంగ్లీషు జ్యోతిష మాసపత్రిక ప్రారంభించారు. అపుడు శనిదశ, బుధభుక్తి, రాహు అంతరం జరుగుచున్నది. సబ్‌లార్డ్ పద్ధతిని, అనేక రహస్యవిధానాలను వివరించే "కృష్ణమూర్తిపద్ధతి"ని వివరించే, 6 రీడర్లను, రచించి ప్రచురించారు. ఆ పుస్తకాలు నిజంగా విజ్ఞానగనులే. 1911 నుండి 1970 వరకు కృష్ణమూర్తి ఎఫిమెరిస్ కూడా రచించి ప్రచురించారు.

ఇట్టి మహోన్నతవ్యక్తి, అపరవరాహమిహిరుడు అయిన కె.యస్.కె. (కృష్ణమూర్తిగారు) 1972-3-30 వ తేదీన బుధవారం, ఉదయం 2 గం॥లకు భౌతిక దేహం చాలించారు. అపుడు శనిదశ, రాహుభుక్తి, రాహుఅంతరం జరుగుతున్నది.

దశానాధుడు శనిమారక స్థానంలో ఉండి తన నక్షత్రంలోనే ఉన్నాడు. మరొక మారకస్థానమైన 7 భావ అధిపతి అయి దానిని చూస్తున్న చంద్రుని సబ్‌లో ఉన్నాడు. బాధకుడైన కుజుని దృష్టి కూడా శనిపై యున్నది.

భుక్తినాధుడైన రాహువు, బాధకుడైన కుజుని నక్షత్రంలో ఉండి, 7 మారకాధిపతి అయిన చంద్రుని సబ్‌లో ఉన్నాడు. అపుడు గోచారరీత్యా రవి 2వ స్థానంలో దశానాధుడైన శని నక్షత్రంలో మోక్షస్థానాధిపతి (12) అయిన గురుని సబ్‌లో సంచరించుచున్నాడు.

భుక్తినాధుడైన రాహువు, జన్మలగ్నమైన మకరంలో రవి నక్షత్రంలో శుక్రుని సబ్‌లో సంచరిస్తున్నాడు. దశానాధుడైన శని, వృషభంలో రవి నక్షత్రంలో, శుక్రుని సబ్‌లో సంచరిస్తున్నాడు.

చీకటిలో మరుగునపడిన జ్యోతిష వెలుగులను, వెలుగులోనికి తీసుకు వచ్చిన ఒక మహర్షి శ్రీకృష్ణమూర్తిగారు. వీరికి గణపతి, సుబ్రహ్మణ్యం, హరి హరన్ అనే ముగ్గురు కుమారులున్నారు.

వీరు అనంతరకాలంలో కె.పి. & అస్ట్రాలజీ అనే చక్కని జ్యోతిషమాస పత్రికను, కొంతకాలం నడిపారు. ప్రముఖ జ్యోతిషపండితుడు, భవిష్యజ్ఞాని కావాలంటే కొన్ని గ్రహసంపుటులు అవసరం. ముఖ్యమైనవాటిని వివరిస్తాను.

## జ్యోతిషంలో రాణింపు

1. లగ్నం సబ్‌లార్డ్ 9–12 భావాల సిగ్నిఫికేటర్ అయివుండాలి. వీటిలో 9వభావం పరిశోధనను ఉన్నత జ్ఞానమును తెలియజేస్తే, 12వ భావం దివ్య దృష్టిని రహస్యశక్తిని తెలియజేస్తుంది.

2. గురుడు 9–12 భావాలకు సంబంధించిన గ్రహముల సబ్‌లో ఉండాలి.

3. శని 9–12 భావాలకు సంబంధించిన గ్రహముల సబ్‌లో ఉండాలి. ఇందువలన జ్యోతిష జ్ఞానము కలుగుతుంది.

4. శుక్రుడు, గురుడు $18^0$ డిగ్రీల దూరంలో ఉంటే ఉన్నతమైన బిరుదులు, సత్కారములు ప్రాప్తిస్తాయి.

5. 2వ భావ సబ్‌లార్డ్ 9-12 భావాలకు సంబంధించిన, యదార్ధమైన భవిష్యత్తును చెప్పగల సమర్థత కలుగును.

6. శని, చంద్రులు, 1-3-9-10 భావాలకు సంబంధించిన జాతకుడు జ్యోతిషశాస్త్రమును అభిమానించి, అధ్యయనము చేయును. యురేనస్‌కు గురుని శుభదృష్టి కలిగిన జ్యోతిషశాస్త్రమునందు పరిశోధన చేయును.

## ఏ విషయానికి ఏ భావం పరిశీలించాలి

ఏవిషయమైనా దాని ఫలితంగూర్చి తెలుసుకోవాలంటే, ముందుగా, అది జాతకునికి లభించే యోగం ఉందో లేదో తెలుసుకోవాలి. అందుకు ముఖ్యమైన భావం యొక్క సబ్‌లార్డ్, దాని సంబంధిత భావాలతో అను కూలమా కాదా అన్నది తెలుసుకోవాలి.

వివాహయోగం ఉన్నదా లేదా అని తెలుసుకోవాలంటే, 7వ భావ సబ్ లార్డ్, 2. 7-11 భావాలతో నక్షత్రం లేదా సబ్, ద్వార సంబంధం కలిగియుండి, దానికి వ్యయభావాలతో అనగా 1-6-10లతో సంబంధం కలిగియుండరాదు.

ఇపుడు కొన్ని విషయాలగూర్చి తెలుసుకోవాలంటే ఏ ఏ భావాలు పరి శీలించాలో తెలియజేస్తాను.

వృత్తం గుర్తు చుట్టబడిన దాని సబ్‌లార్డ్ ఆ విషయానికి ముఖ్యసూచక గ్రహంగా గుర్తించాలి.

| | | |
|---|---|---|
| 1. | ప్రాథమిక విద్య | (4)- 11 |
| 2. | ఉన్నతవిద్య | (4)- 9 - 11 |
| 3. | కాలేజీ ఎడ్మిషన్ | (4)- 6 -11 |
| 4. | స్కాలర్‌షిప్ | 6 -(9)- 11 |
| 5. | మెడికల్ కాలేజీ ప్రవేశం | (4)- 9 రవికుజులు సింహరాశి |
| 6. | ఉద్యోగం | 2 - 6- (10) |
| 7. | ప్రభుత్వోద్యోగం | (10) + రవి |
| 8. | బదిలీ | 3 - (10) - 12 |

| | | |
|---|---|---|
| 9. | ఉద్యోగంలో ఉన్నతి | 2 - 6 - 10 - 11 |
| 10. | వ్యాపారం & స్థలమార్పు | 2 - 3 - 10 - 11 - 12 |
| 11. | ధనలాభం | 2 - 11 |
| 12. | లిటిగేషన్‌విజయం | 6 -11 |
| 13. | వివాహం | 2 - 7 - 11 |
| 14. | ద్వితీయ వివాహం | 2 - 7 - 11 - ద్విస్వభావరాశి |
| 15. | సంతానం | 2 - 5 - 11 |
| 16. | విడాకులు | 1 - 6 - 10 |
| 17. | రోగం | 6 |
| 18. | ఇల్లు కొనడం- | 2 - 4 - 11 - స్థిరరాశి |
| 19. | వాహనం కొనడం | 2 - 4 - 11 - చరరాశి |
| 20. | ఋణంపొందడం | 2 - 8 - 11 - 6 |
| 21. | అప్పు తీర్చడం | 8 - 12 |
| 22. | పెంపుడు జంతువులు | 6 - 11 |
| 23. | విదేశం | 3 - 9 - 12 |
| 24. | పుస్తక ప్రచురణ | 3 - 6 - 10 - 9 |
| 25. | స్వంత ప్రచురణ | 3 - 10 - బుధ, కుజ |
| 26. | తప్పిపోయిన వానిరాక | 3 - 11 |
| 27. | సంతృప్త ఆధ్యాత్మిక జీవితం | 5 - 10 |
| 28. | మంత్రసిద్ధి | 5 - 10 - 11 |
| 29. | అభివృద్ధికరమార్పు | 2 - 6 - 10 - 12 |
| 30. | మంచిధరలో ఆస్తిఅమ్మకం | 3 - 4 - 5 - 7 - 10 |
| 31. | సంఘంలో ప్రతిష్ఠ | 1 - 10 |
| 32. | వ్యాపారంలో భాగస్వాములు విడిపోవడం | 7 - 11 |

| | | |
|---|---|---|
| 33. | నగలు కొనడం | 4 - 11 శుక్రుడు |
| 34. | క్రీడాకారుడు కావడం | 3 - 10 - 11 కుజుడు |
| 35. | ఇనుము వ్యాపారం | 6 - 10 - శని |
| 36. | న్యాయవాదవృత్తి | 6 - 10 గురుడు |
| 37. | స్పెక్యులేషన్, షేర్లు లాభం | 2 - 5 - 6 - 11 |
| 38. | ప్రమాదం | 8 - 12 |
| 39. | తల్లిదండ్రులకు సహాయపడటం | 1 - 10 - 11 |
| 40. | గౌరవం కీర్తి పొందడం | 10 - 11 |
| 41. | శత్రువులపై విజయం | 1 - 6 - 11 |
| 42. | జ్యోతిషంలో ప్రసిద్ధి | 3 - 9 - 12 బుధ |

## సహజమరణమా ? అసహజమా ?

పుట్టిన ప్రతీ ప్రాణికీ మరణం తప్పనిసరి, అది ప్రకృతి ధర్మం జీవించడమే వికృతి, ఈ విషయం కాళిదాస మహాకవి ఇలా వివరించాడు.

శ్లో॥ మరణం ప్రకృతిః శరీరిణాం వికృతిర్జీవితముచ్యతే ।

క్షణమప్యవతిష్ఠతే యది శ్వసన్ నను జంతుర్లాభవానసౌ॥

క్షణకాలం జీవించినా, అది లాభమే కనుక కాలం విలువ తెలుసుకొని జీవించాలి. మానవుడు దేనినైనా సంపాదించగలడు. కాని, గతించిన కాలం తిరిగి పొందలేడు.

అయితే, పండినపండు చెట్టునుంచి ఎలా దానంతట అదే పడి పోతుందో, అలా పండిన వయసులో మరణించడం, అనేది సహజమరణమని ఇది చాలా అదృష్టమని పూర్వులు చెబుతారు.

మృత్యుంజయ మంత్ర జపంవల్ల కలిగే ఫలితం కూడా అలా సహజమైన మరణం ప్రసాదించమనే అర్థం తెలియజేస్తూ, అపమృత్యువువల్ల, అసహజ మరణాలు కలిగించవద్దనే ఆ మంత్రార్థం తెలియజేస్తుంది.

పండిన దోసకాయ (ఉర్వారుకం) ఎలా, సున్నితంగా, తొడిమ నుంచి విడివడుతుందో అలా జీవుడు శరీరంనుంచి విడువడాలని మంత్ర భావము.

త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ।

**ఉర్వారుకం మివ బంధనాత్ మృత్యోర్ముక్షీ యమామృతాత్ ॥**

తాంత్రిక మృత్యుంజయమంత్రం ఇలా ఉంటుంది.

**ఓం జూం సః**

ఇక, సహజమరణం ఏ జాతకునికి లభిస్తుందో తెలుసుకుందాం. కె.పి. విధానంలో దీనిని ముఖ్యంగా ఈ సూత్రంవల్ల తెలుసుకోవచ్చు.

8వ భావ సబ్‌లార్డ్ ర-చ-బు-గు-శు నక్షత్రములలో ఉండి 6-8-12 భావములతో సంబంధం ఉన్నట్లయితే మరణము సహజంగా కొద్దిపాటి రోగముతో ఏర్పడుతుంది.

శని కుజుల సంబంధం, 4-8-12 భావముల సంబంధం ఉంటే, అసహజమరణం ప్రమాదాలవల్లగాని ఆపరేషన్ అనంతరంగాని సంభవిస్తుంది.

దశానాధునికి మారక బాధక గ్రహ, సంబంధం ఉన్నప్పుడే మరణం కలుగుతుంది. 6వ భావ సబ్‌లార్డ్ లగ్నభావంతో సంబంధం కలిగితే రోగ బాధలు కలుగుతాయి. 5-9 భావాల సంబంధం, బాధకత్వదోషం లేని 11వ భావ సంబంధంవల్ల రోగ నివారణ జరిగి, ఆరోగ్యం ఏర్పడటం జరుగుతుంది.

## కొన్ని 4 స్టెప్ - థియరీ ఉదాహరణలు

కె.పి. విధానంలో సబ్‌లార్డ్‌కు ఎంతో ప్రాముఖ్యమున్నది. గ్రహము తానున్న నక్షత్రము ద్వారా ధనప్రాప్తిని సూచిస్తే, అది ఎంత ? వచ్చే విదానము ఏది? ఎప్పుడు వస్తుంది అన్నది సబ్ తెలియచేస్తుంది. అలాగే భావం యొక్క సబ్‌లార్డ్ ఆ భావం మంచి ఫలితమిస్తుందా ? చెడు ఫలితమిస్తుందా ? అవుతుందా ? అవదా ? జయమా ? పరాజయమా? అన్నది తెలియజేస్తుంది.

## విదేశ ప్రయాణం

కస్పల్ సబ్‌లార్డ్ రూల్ ప్రకారం అయితే 3-9-12 భావాల సబ్‌లార్డ్‌ల వల్ల వి శీయానం ఉన్నదా ? లేదా ? ఉంటే ఎందునిమిత్తం వెళతారు.

తాత్కాలిక నివాసమా? స్థిర నివాసమా ? గ్రీన్‌కార్డ్ వస్తుందా ? రాదా ? ఇవన్నీ కె.పి. విధానంలో తెలుసుకోవచ్చు.

ఇక 4 స్టెప్ థియరీ విధానంలో పరిశీలిద్దాం. ఒక జాతకునికి బుధ దశ 1 శుక్ర అంతర్దశ జరుగుతున్నది. బుధుడు 12/1-4లో ఉండి 12/4లో ఉన్న రవి నక్షత్రంలో ఉన్నాడు. **ఇదే బుధ దశ. బుధ అంతర్దశలో జాతకుడు ఉద్యోగం పొందాడు ఎలా** ? బుధునికి కేవలం 12వ భావం సంబంధం మాత్రమే ఉన్నది.

ఆధిపత్యరీత్యా రవి, బుధులకు 5-1-2-4 వచ్చాయి. మిధునలగ్నం 1-2 భావాలు మిధునంలో పడ్డాయి. కన్య 5వ భావం అయింది. సింహం 4వ భావం అయింది. ఇవేమీ ఉద్యోగాన్ని సూచించడంలేదు. మరి ఎలా వచ్చింది.

ఇది తెలుసుకోవాలంటే సబ్‌ని పరిశీలించాలి. బుధుడు 7లో ఉన్న శని సబ్‌లో ఉన్నాడు. శని 9-10 భావాలకు అధిపతి అయ్యాడు. 9లో చంద్రుడుండటంచేత ఆ భావంబలహీనపడి ఆ భావఫలితం ఇవ్వడు. ఇక 10లో గ్రహాలు లేవు. 6లో ఉన్న గురుడి రాశిలో (7వ భావం ధనుస్సులో) శని ఉన్నాడు. కనుక శని 6-10 భావాలకు బలమైన సిగ్నిఫికేటర్ అయ్యాడు. తరువాత సబ్‌లార్డ్ శని 10లో ఉన్న కేతువు నక్షత్రం (మూల) లో ఉన్నాడు. ఇపుడు సబ్ ద్వారా 6-10 భావాల సంబంధం ఏర్పడటంవల్ల బుధ దశ-బుధ అంతరంలో ఉద్యోగం వచ్చింది. 4 స్టెప్‌థియరీలో ఇలా వ్రాసుకోవాలి.

బు 12 - ర 12 - శ - 7 (6-10) - కే 10
(1-2-5) (4) (9-10)

ఇదే జాతకుడు బుధ దశ శుక్రాంతర్దశలో విదేశం వెళ్లడం జరిగింది? ఇపుడు అంతర్దశా నాధుడైన శుక్రుని 4స్టెప్ థియరీలో పరిశీలిద్దాం.

శు 1 - గు 6 - బు 12 - ర 12
(7-8-12)

శుక్రుడికి సబ్‌స్థాయిలో 12వ భావ సంబంధం బలంగా కలగడంతో, దశానాధుడికి బుధునికి కూడా 12వ సంబంధం కలగడంవల్ల శుక్రాంతర్దశలో విదేశీయానం కలిగింది.

# వివాహం

ఈ జాతకునికి శుక్రదశలో వివాహం ఎప్పుడు జరిగినది 4 స్టెప్ థియరీ ద్వారా వివరిస్తాను. దశానాధుడైన శుక్రుడు 5లో ఉండి 7లో ఉన్న గురుడి నక్షత్రంలో ఉన్నాడు. గురుడు 2-11 భావాలకు అధిపతి అయ్యాడు. గురుడి నక్షత్రంలో గ్రహాలు ఏమీలేవు కనుక, 2-11 భావాలను బలంగా సిగ్నిఫై చేస్తున్నాడు. శుక్రుడి నక్షత్రంలో ఇతర గ్రహాలున్నాయి. వివాహం కాలేదు.

శు 5 - గు 7 (2-11)

ఎందుచేతననగా, శుక్రుడు 5లో ఉన్న రవి సబ్‌లో ఉన్నాడు. రవికి 7వ ఆధిపత్యం వచ్చింది కాని కుజుడు రవి నక్షత్రంలో ఉండటంవల్ల రవి 7వ భావం సిగ్నిఫై చేయలేదు. సబ్‌లార్డ్ అయిన రవి లగ్నంలో ఉన్న రాహు నక్షత్రంలో ఉన్నాడు. కుంభంలో ఉన్న రాహువు, తానున్న రాశ్యాధిపతి శని రాశులకు ఏజెంట్‌గా, మకరానికి అనగా 12వ భావానికి కూడా సిగ్నిఫికేటర్ అయ్యాడు. కనుక శు /శులో వివాహం కాలేదు. 4 స్టెప్ థియరీలో ఇలా వేసుకోవాలి.

శు 5 - గు 7 - ర 5 - రా 1

(4-9) (2-11) (7) (1-12)

అనంతరం శుక్రదశలో రవి అంతర్దశ వచ్చింది. ఈ సమయంలోనూ వివాహం జరగలేదు. కాని ఉద్యోగం వచ్చింది. 4 స్టెప్ థియరీలో దీన్ని పరిశీలించండి.

ర 5 - రా 1 - శ 12 - చ 6

(7) (1-12) (1-12) (6)

పై వివరణలో వివాహానికి సంబంధించిన 2-7-11 భావాలు ఏమీ సూచించబడటంలేదు. పైగా వివాహానికి వ్యతిరేకమైన 1-6-12 భవాలు సూచించబడుతున్నాయి. 6 భావం బలంగా సిగ్నిఫై కావడంవల్ల శుక్రదశలో 1 రవి అంతర్దశలో ఉద్యోగంవచ్చింది. వివాహ ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు.

అనంతరం చంద్ర అంతర్దశ వచ్చింది. ఈ సమయంలోనూ వివాహం కాలేదు. ఎందుచేతననగా-

చ 6 - బు 5 - చ 6 - బు 5

(6) (5-8) (6) (5-8)

2-7-11 భావాల సిగ్నిఫికేషన్ లేదు.

అనంతరం కుజ అంతర్దశ వచ్చింది. వివాహం జరిగింది. ఎందుచేతనో పరిశీలిద్దాం. కుజుడు 7లో ఉన్నాడు. కుజుని నక్షత్రాలలో ఇతర గ్రహాలు ఏమీలేవు. కనుక కుజుడు 7వ భావాన్ని బలంగా సిగ్నిఫై చేస్తున్నాడు. ఆధిపత్యరాశులలో 3-10లో కూడా గ్రహాలు లేనికారణంగా 3-10 కూడా సిగ్నిఫై చేస్తున్నాడు. 5లో ఉన్న రవి నక్షత్రంలో ఉన్నాడు. ఇక అతిముఖ్యమైన సబ్‌ని పరిశీలిస్తే 7లో ఉన్న గురుని సబ్‌లో ఉన్నాడు. ఈ గురుడు 2-11 భావాలకు అధిపతి, 2-11లో గ్రహాలు ఏమీలేవు. ఇలా 2-7-11 భావాల సంబంధం కుజునికి రావడంవల్ల కుజాంతర్దశలో వివాహం జరిగింది.

దీనిని 4 స్టెప్ థియరీలో ఇలా వ్రాసుకుని పరిశీలిస్తే అతి సులభంగా అర్థం అవుతుంది. గమనించండి.

కు 7 - ర 5 - గు 7 - శు 5

(3-10) (7) (2-11) (4-9)

కుజుని సబ్‌లార్డ్ అయిన గురుడు వివాహానికి కారకుడైన 5లో ఉన్న శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. ఈ శుక్రుడు కూడా వివాహ వ్యతిరేకమైన 1-6-10-12లను సూచించడం లేదు. కనుక వివాహం జరిగింది.

## గృహనిర్మాణం

ఒక జాతకుడు తన స్థలంలో గృహం నిర్మిద్దామని ప్రశ్న కొరకు వచ్చాడు. ఇతనికి జాతకంలేదు. కనుక 249 నెంబర్స్ అనుసరించి, ప్రశ్నశాస్త్రరీత్యా పరిశీలించడం జరిగింది. దీనినే 4 స్టెప్ థియరీలో అయితే ఎలా పరిశీలించాలో వివరిస్తాను. గృహనిర్మాణానికి ముఖ్యంగా 4వ భావ సబ్‌లార్డ్ పరిశీలించాలి. ఈ ప్రశ్నలో 4వ భావ సబ్‌లార్డ్ బుధుడయ్యాడు. బుధుడు 8లోఉండి, 11లో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు. ఇంతవరకూ బాగానేయున్నది.

కాని, సబ్‌మాత్రం 10లో ఉన్న శుక్రుడి దయింది. శుక్రుడి నక్షత్రాలలో ఇతర గ్రహాలు ఏమీలేవు. 3 ఇది వ్యతిరేకం. 4కి వ్యయం కనుక.

ఈ శుక్రడు 8లో ఉన్న రవి నక్షత్రంలో ఉన్నాడు. ఇది కష్టాలను సూచిస్తున్నది. కనుక గృహనిర్మాణం జరుగదు. జాతకుడు ఎంతో ప్రయత్నం చేశాడు, కాని ఫలించలేదు. 4 స్టెప్ థియరీలో దీన్ని ఇలావేసుకోవాలి.

బు 8 - కే 11 - శు 10 - ర 8

(11-2) (2-11) (3-10) (1)

## ఆత్మహత్య

ఒక జాతకురాలి జన్మచక్రం ఆధారంగా ఆయుస్సమాప్తిని ముందే గుర్తించినట్లు కలకత్తాకు చెందిన శ్రీ ప్రసేనజిత్ హల్దార్ (కె.పి.జ్యోతిష్కులు) వివరించారు.

ముఖ్యంగా లగ్నం సబ్‌లార్డ్ - సబ్‌లార్డ్ ఉన్న స్టార్‌లార్డ్ 1-5-9-10 -11 సిగ్నిఫైచేస్తే అది దీర్ఘాయుర్జాతకుని గ్రహించాలి. బాధక మారక గ్రహ సంబంధం ఉండరాదు.

8వ భావ సబ్‌లార్డ్ 1-8-12 భావాలకు సంబంధం ఉంటే ప్రమాదం జరుగుతుంది. అగ్ని-జల-వాయు పృధ్వీ తత్వ రాశులను అనుసరించి మరింత వివరంగా విశదీకరించవచ్చు. సంగ్రహంగా వివరిస్తాను.

8వ భావ సబ్‌లార్డ్ బాధక, మారక గ్రహాలు సంబంధం కలిగి 8వ భావం కుజ సంబంధం లేదా కేతు సంబంధం కలిగితే ఆత్మహత్య చేసుకోవాలనే ప్రవృత్తి కలిగియుంటారు.

జాతకురాలి 8వ భావసబ్‌లార్డ్ చంద్రుడు 7వ భావంలో ఉండి, 8వ భావానికి అతి సమీపంలో ఉన్నాడు. కుజుని రాశిలో ఉన్న రవి నక్షత్రంలో ఉండి, కుజునిచే చూడబడుతున్నాడు. ఈమె శరీరం కాల్చుకుని ఆత్మహత్య చేసుకుంది. ఆ సమయంలో దశావివరాలు ఇలా ఉన్నాయి. రాహుదశ, బుధ అంతరం శని విదశ,

దశానాధుడు రాహువు 8లో ఉన్నాడు; 3 కుజుని నక్షత్రంలో ఉన్నాడు. 8లో ఉన్న గురుని సబ్‌లో ఉన్నాడు.

రా 8 - కు 3 - గు 8 - గు 8

అంతర్దశానాధుడు బుధుడు 8వ అధిపతి అయి 11లో ఉన్నాడు. మారక స్థానంలో 2 లో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు. కేతువు సబ్‌లోనే ఉన్నాడు.

బు 11 - కే 2 - కే 2 - బు 11

(5-8) (2-11) (2-11) (5-8)

విదశానాధుడైన శనికూడా 2లో ఉన్న కేతువు నక్షత్రంలో 11లో ఉన్నాడు. 1-12 ఆధిపత్యంతో హాస్పటల్‌లో మరణాన్ని సూచించాడు.

మరణసమయానికి గోచార రీత్యా కూడా రవి బాధకుడైన శుక్రుని నక్షత్రంలో సంచరిస్తున్నాడు. చంద్రుడు కూడా ధనుస్సులో శుక్ర నక్షత్రంలో సంచరిస్తున్నాడు.

## ప్రమాదంలో మరణం

ఈ జాతకునికి కుజదశ జరుగుచున్నది. 4స్టెప్ థియరీలో మొత్తం పరిశీలిద్దాం. 2-7 భావాలకు అధిపతియై 12లో ఉన్నాడు.

కు 12 - చ 10 - బు 11 - శు 12

(2-7) (10) (9-12) (1-8)

కుజునికి బాధక, మారక, వ్యయభావాల సంబంధం బలంగా కలిగింది. శుభభావాలైన 9-10-11 భావ సంబంధ ఫలితాలు కూడా ఆర్థికంగా హోదారీత్యా దూరప్రయాణాలు అన్నీ ఇచ్చాడు కేతు అంతర్దశలో ఘోర రోడ్డు ప్రమాదం జరిగి హాస్పటల్‌లో 5 రోజులుండి, హాస్పటల్‌లోనే మరణించాడు. ఇక కేతువు స్థితిని పరిశీలిద్దాం.

కే 3 - ర 11 - గు 11 - శు 12

(4-5) (11) (3-6) (1-8)

ఇలా కేతువుకి 4-6-8-12 భావాలు, బాధక స్థాన, ఆ స్థానంలో ఉన్న బాధకుని సంబంధం బలంగా కలిగాయి. కుజదశ, కేతు అంతర్దశలో ప్రమాదం వల్ల మరణం కలిగింది.

# ఉద్యోగం

ఒక జాతకురాలికి కుజదశ జరుగుచున్నది. కుజుడు 10లో ఉండి 8లో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు. కుజుని నక్షత్రాలలో, రవి-కేతువు లున్నారు. కనుక కుజుడు 10వ భావ ఫలితాలు ఇవ్వడు. కేతువు వున్న రాశ్యాధిపతి శుక్రుడు ఇతని స్థానాలు 4-9;

కుజుడు 8లో ఉన్న కేతువు నక్షత్రంలో ఉండటంవల్ల కష్టాలు,నష్టాలు, ఆటంకములు కలగాలి. ఇది ఏవిధంగానూ అభివృద్ధికరంకాదు. కాని ఈ జాతకురాలు, ఈ కుజదశలోనే చక్కగా డిగ్రీపాసై గురుభుక్తిలో స్థిరమైన ఉద్యోగం సంపాదించింది. ఎలాగ ? అంటే కుజుడు ఇలా ఉన్న 6వ స్థానాధి పతి అయిన చంద్రుని సబ్‌లో ఉన్నాడు. చంద్రుడు 6లో ఉన్న శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. దీని 4 స్టెప్‌లో ఇలా వ్రాయాలి.

కు 10 - కే 8 - చ 2 - శు 6

(3-10) (4-9) (6) (4-9)

కుజాంతర్దశలో విద్య బాగా జరిగింది. అనంతరం రాహు అంతర్దశలో కూడా విద్య నిర్విఘ్నంగా పూర్తి అయింది. రాహువు వివరాలు ఇలా ఉన్నాయి.

రా 2 - కే 8 - చ 2 - శు 6

(4-9)

రాహువు సబ్‌లార్డ్ చంద్రుడు శుక్రుని నక్షత్రంలో ఉండటం వల్ల 4-9లో గ్రహాలు ఏమీ లేకపోవడంవల్ల 4-9 భావాల ఫలితంగా చక్కని విద్య పూర్తయింది.

ఇక గురుని అంతర్దశలో ఉద్యోగం వచ్చింది. గురుని వివరాలు ఇలా ఉన్నాయి.

గు 6 - కే 8 - రా 2 - కే 8

(2-11) (4-9) 3-10

అంతర్దశానాధుడైన గురుని నక్షత్రంలో బుధుడున్నాడు. అందుచేత గురుడు 2-6-11 ఫలితాలు సిగ్నిఫై చేయడం కాని గురుని సబ్‌లార్డ్ అయిన రాహువు రెండులో ఉండి 2-3-10 రాశులను సిగ్నిఫై చేస్తున్నాడు. రాహువు

నక్షత్రంలో ఇతర గ్రహములు ఏమీలేవు. కనుక రాహువు అంతర్దశలో ఉద్యోగం వచ్చింది.

అనంతరం వచ్చిన శని అంతర్దశలో వివాహం జరిగింది.

శ 1 - శ 1 - రా 2 - కే 8

(1-12) (3-10)

శని తన సబ్‌ద్వారా 2-8 సిగ్నిఫై చేస్తున్నాడు. 2 కుటుంబం, 8 కష్టం; కేతువు, శుక్రునిరాశులైన 4-9లను స్థితిచేత సిగ్నిఫై చేస్తున్నాడు. (7వ భావం సబ్‌లార్డ్ అయిన శుక్రుడు, రాహువు సబ్‌లో ఉన్నాడు, శుక్రుడు 7లో ఉన్నాడు.)

## రోగము

కె.పి. జ్యోతిషంలో 6వ భావం సబ్‌లార్డ్, రోగమును తెలియజేస్తాడు. అని కొందరంటారు. కాని అది పూర్తిగా సరికాదు. ఎందుచేతననగా, జన్మ జాతకంలో 6వ భావం సబ్‌లార్డ్, జాతకునికి వచ్చురోగము, దీర్ఘరోగమా ? తాత్కాలిక రోగమా? అని మాత్రమే తెలియజేయును.

జాతకునికి వచ్చు రోగములు, వివిధ దశలననుసరించి, దశానాధులకు ఇతర రాశి సంబంధము ననుసరించియే సంభవించును.

ఉదా :- ఒక జాతకునికి 6వ భావం సబ్‌లార్డ్ రాహువు 11లో రాశిలో ఉండి శని సబ్‌లో ఉన్నాడు శని 12లో ఉన్న గురుని నక్షత్రంలో ఉన్నాడు.

ఇదే గురువు 6-12 అధిపతి అయినందున వ్యాధి తీవ్రతను హాస్పటల్‌లో ఉండుటను సూచిస్తున్నాయి. సబ్‌లార్డ్ రాహువు మిధున, కన్యలను సూచించుటచేత, ఆ రాశులవల్ల భుజములు, పేగులు వ్యాధిస్థానములు అగుచున్నవి. కాని, ఈ జాతకుడు హృదయ సంబంధ వ్యాధితో బాధపడి ఆపరేషన్ నిమిత్తము విదేశము వెళ్ళినాడు.

హృదయరోగము అని ఎట్లు తెలియుచున్నది. అనగా ప్రస్తుతము జాతకునకు చంద్రదశ జరుగుచున్నది. చంద్రుడు, వృశ్చికరాశిలో బుధుని నక్షత్రములో నున్నాడు. బుధుడు సింహరాశిలో ఉన్నాడు, చంద్రుడు, శుక్రునిసబ్‌లో ఉన్నాడు. మరల ఈ శుక్రుడు, సింహంలో ఉన్న బుధుని నక్షత్రంలో ఉన్నాడు.

సింహరాశి కాలపురుషునికి హృదయమని చెప్పబడినది. చంద్రదశ, చంద్ర అంతర్దశలో హృదయ సంబంధ వ్యాధి ఏర్పడినది.

దశ : చ - బు - శు - బు

(వృశ్చికం) (సింహం)

రోగనిర్ధారణను పైవిదంగానే చేయాలి. అదేవిధంగా 10వ భావం సబ్‌లార్డ్ కూడా ఒకవృత్తిని సూచిస్తాడు తప్ప, అది ఒక్కటి మాత్రమే చివరిదని తెలియజేయడు. ఒకరు ఒక ఉద్యోగంలోచేరి, వివిధ దశాంతర్దశలలో రక రకాలుమారి ఉన్నతస్థాయి చేరుకుంటారు.

10వ భావం సబ్‌లార్డ్ వల్ల తన వృత్తిలో జాతకుడు ఎలారాణిస్తాడు. స్థాయి ఏమిటి అనేది మాత్రమే తెలియబడుతుంది. చేసేపని, అనగా సర్వీస్ 6వ భావం సబ్‌లార్డ్ తెలియజేస్తాడు. ఒక జాతకుడు సర్వీస్ రీత్యా ప్యూన్ ఉద్యోగమైనా, 10వ భావం సబ్‌లార్డ్ హోదాను తెలియజేస్తే ఆ ఉద్యోగి ఏ పనీ చేయకుండానే, ఇతర ఉద్యోగుల సహాయంతో, దర్జావెలగబెడుతూ ఉంటాడు.

మరికొందరు సర్వీస్‌రీత్యా ఆఫీసర్ అయినా, స్వభావరీత్యానో, తొందర పని వత్తిడులవల్లనో ఆ ఫైల్సు తామే పట్టుకువెళ్లి ఇతర గుమాస్తాలకు అందించడం తనరూమ్ తానే శుభ్రం చేసుకోవడం వంటి ప్యూన్ పనులు చేస్తుంటారు.

## విద్య

4వ భావం సబ్‌లార్డ్ డిగ్రీవరకు విద్యను, ఆపై 9వ భావం సబ్‌లార్డ్ పోస్టుగ్రాడ్యుయేషన్ రీసెర్చి మొ॥ విషయములు తెలియజేస్తారు. దశాంతర్దశా నాధులకు 4-9 సంబంధంవలన కూడా ఈ ఫలితములు తెలియవచ్చు.

4వ భావం సబ్‌లార్డ్‌కి 9వ భావం సబ్‌లార్డ్‌తో సంబంధం ఉంటే, డిగ్రీ తరువాత పోస్ట్ గ్రాడ్యుయేషన్ విఘ్నంలేకుండా కొనసాగుతుంది. లేక పోతే డిగ్రీతో ఆగిపోయింది. మళ్లీ 9వభావం సబ్‌లార్డ్ సంబంధంకల దశాంత ్దశలు వచ్చినపుడు పోస్టుగ్రాడ్యుయేషన్ రీసెర్చి మొ॥ కొనసాగుతాయి.

9వ భావ సబ్‌లార్డ్ 9-10 భావాలకు సంబంధం కలిగితే వృత్తి విద్యలు ఉన్నతస్థాయిలో అనగా డాక్టర్ లాయర్, ఎకౌంట్స్, ఆడిట్ మొ॥ సంభవిస్తాయి. 8వ భావ సంబంధం వల్ల విఘ్నాలు కలుగుతాయి. 4-7-10 భావాల సంబంధం కలిగితే జాతకుడు అన్నీ అనుభవంవల్లనే తెలుసుకొంటాడు.

కుజ,శని, సంబంధంవల్ల ఇంజనీరింగ్ 1-6 సంబంధంవల్ల మెడిసిన్; 1-4-6 సంబంధంవల్ల వెటర్నరీ మెడిసిన్ విద్య ప్రాప్తిస్తాయి. 6-12 వల్ల ఎకౌంటెన్సీ ఆడిటింగ్, 3-9-12వల్ల పరిశోధన, డాక్టరేట్ 3-6-11వల్ల లా, 1-2-6 సంబంధంవల్ల టాప్‌మెరిట్‌లిస్ట్‌లో చేరతారు.

9వ భావం సబ్‌లార్డ్ 5-9 భావాలలో సంబంధించిన అద్భుతమైన మేధా సంపత్తి, పరిశోధనాత్మక బుద్ధితో, బాలమేధావి స్థాయినుంచి రాణిస్తారు.

9వభావం చరరాశులకు సంబంధించిన జీవితాంతం చదువుతూనే యుంటారు. స్థిరరాశుల సంబంధంకలిగిన ఒకస్థాయిలో విద్య ఆగిపోతుంది. ద్విస్వభావ రాశుల సంబంధంవల్ల అనేక విఘ్నాలతో కొనసాగుతూనే యుంటుంది.

## ఆయుర్వేదమా ? అల్లోపతీయా ?

రోగనివారణకు, ఆయుర్వేదం హోమియోపతి అల్లోపతి (ఇంగ్లీషువైద్యం) యునాని, మొ॥ వైద్యవిధానాలున్నాయి. కె.పి.రీత్యా కొందరికి ప్రత్యేక వైద్య విదానంలోనే రోగనివారణ జరుగుతుంది. ఇంగ్లీషు వైద్యం ద్వారా కుదరని దీర్ఘవ్యాధులు, హోమియోపతి, ఆయుర్వేదం వల్ల తగ్గిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి.

వ్యాధి వచ్చినపుడు, దానినివారణకు ఏ వైద్య విధానం అనుసరించాలో తెలుసుకోవాలనుకున్నపుడు కె.పి. ప్రశ్నద్వారా తెలుసుకోవచ్చు. ఒక ఉదాహరణతో దీనిని వివరిస్తాను.

ఒక జాతకుడు తనకు సంభవించిన వ్యాధి నివారణకు ఏ విధానం అనుసరించాలో తెలుసుకోవాలని ప్రశ్నించాడు. అతడు చెప్పిన 249లోపు 2 నెంబర్లు చెప్పగా వాటి ననుసరించి ఒకదానికి (అల్లోపతి) 5వ భావం సబ్‌లార్డ్ కేతువై, 6లో ఉన్నాడు. దీని ఫలితం ఈ వ్యాధి పూర్తిగా నయంకాదు.

ఈ కేతువు బుధుడి నక్షత్రంలో ఉన్నాడు. బుధుడు 1లో ఉండి 5-8 ఆధిపత్యం పొందాడు. 11వ భావం సబ్‌లార్డ్‌ననుసరించి నివారణ తెలుసుకోవాలి. ఇది శీఘ్రగమనం గల గ్రహం అయితే త్వరగా కోలుకోవడం నివారణ కావడం జరుగుతుంది. ప్రశ్నలో సంబంధిత భావ సబ్‌లార్డ్ వక్రగ్రహ సంబంధం ఉండరాదు.

ఇక ఈ ఉదామరణలో రెండవ నెంబరు ఆయుర్వేదం గూర్చి వేసినది. దీనిరీత్యా 5వ భావ సబ్‌లార్డ్ చంద్రుడు వక్రగ్రహ సంబంధంలేకుండా, 11వ భావంలో ఉన్నాడు. 1-4 అధిపతి అయి 7లో ఉన్న గురుని నక్షత్రంలో ఉన్నాడు. కనుక ఆయుర్వేదంలో నెమ్మదిగా నివారణకలుగుతుంది.

## దొంగను గూర్చి వివరాలు

ఎప్పుడైనా ఎక్కడైనా దొంగతనం జరిగినపుడు, దానిని కె.పి. జ్యోతిష విధానంలో ఎంత సునిశితంగా పరిశీలించి నిజంతెలుసుకోవచ్చును అన్నది తెలియజేస్తాను.

7వ భావం సబ్‌లార్డ్ దొంగను తెలియజేస్తాడు. ఇతడు బుధుడయితే దొంగ యువకుడు, శని అయితే వృద్ధుడు, వృద్ధురాలు, లేదా పనివారు; శుక్రుడయితే యువతి; గురుడయితే నడివయసువాడు; రవి అయి 10-11-12 భావాల సంబంధం కలిగితే యువకుడు చంద్రుడయితే ఎవరు ప్రశ్నఅడిగారో, వారివయసుతో సమానమైన వయసుగలవారే దొంగఅయి ఉంటారు.

ఈ 7వ భావం, లగ్నానికి సంబంధం కలిగిఉంటే, దొంగ తెలిసినవాడే అయివుంటాడు. రెండవభావంతో సంబంధం ఉంటే, కుటుంబ సభ్యులలో ఒకరు ఆ దొంగతనం చేసినట్లు తెలుసుకోవాలి. మూడవ భావ సంబంధం ఇరుగు పొరుగు, వార్తాహరుడు లేదా తమ్ముడు లేదా చెల్లెలు.

నాల్గవ భావ సంబంధం దొంగ ఆ ఇంట్లోనే ఉన్నాడు. అయిదవ భావ సంబంధం సంతానం,ప్రశ్న అడిగిన వారిని ప్రేమించువారు, లేదా కళాకారుడు. ఆరవ భావసంబంధం సేవకుడు లేదా ప్రత్యక్ష శత్రువు. ఎనిమిదవ భావ సంబంధం కొత్తవాడు లేదా పాతసేవకుడు.

తొమ్మిదవ భావసంబంధం, సన్యాసి లేదా కొత్తవాడు లేదా ఆచార వంతునిగా నటించువాడు పదవ భావసంబంధం వ్యాపారి సంశయించడానికి వీలులేని గౌరవ ప్రదమైన వ్యక్తి.

పదకొండవ భావసంబంధం స్నేహితుడు, నమ్మకస్తుడు లేదా జ్యేష్ఠ సోదర, సోదరిలు. పన్నెండవ భావసంబంధం, కొత్తవాడు లేదా రహస్య శత్రువు, లేదా ముష్టివాడు లేదా పేదవాడు.

## దొంగిలించిన వస్తువు ఎక్కడ ఉన్నది ?

7వ భావం సబ్‌లార్డ్, 10వ భావం సబ్‌లార్డ్‌తో ట్రైన్ లేదా సెక్స్‌టైల్ దృష్టి ఉంటే అది దొంగ ఇంట్లోనే ఉన్నదని గుర్తించాలి. 3-6-9-12 భావాలతో సంబంధం ఉంటే దొంగ సమీపంలోనే ఉంటుంది.

చరరాశి సంబంధం ఉన్నట్లయితే, దొంగిలించబడిన వస్తువు ప్రయాణంలో ఉన్నదని గుర్తించాలి. స్థిరరాశి సంబంధం ఉంటే, 10వ భావ సంబంధం కూడా ఉంటే అది దొంగ ఇంట్లోనే ఉంటుంది. అదే స్థిరరాశి 5వ భావంతో సంబంధం ఉన్నట్లయితే అది దొంగయొక్క ప్రియురాలు, లేదా స్నేహితుని ఇంట్లో ఉన్నదని గుర్తించాలి. 3వ భావం రాహువుతో యుండినట్లయితే దొంగ, అద్దె ఇంట్లోగాని, లాడ్జిలోగాని యుంటాడు.

కుజ, శుక్రులకు 3వ భావసంబంధం, ఉన్నట్లయితే దొంగ హోటల్‌లో ఉంటాడు. 3వ భావానికి గురు సంబంధం ఉంటే, దొంగ దేవాలయాలు, పాఠశాలలు, వంటి మతసంబంధ, విద్యా సంబంధ సంస్థల్లో ఉన్నట్లు గుర్తించాలి.

## దొంగిలింపబడిన సొత్తు దొరుకుతుందా ?

2వ భావం సబ్‌లార్డ్ 6-11 భావాలతో సంబంధం ఉన్నట్లయితే పోయిన సొత్తు తిరిగి లభిస్తుంది. 2-6-11 సిగ్నిఫికేటర్లు, రూలింగ్ ప్లానెట్స్‌తో సంబంధం ఉన్నా పోయిన సొత్తు తిరిగివస్తుంది.

అదే 5-8-12 భావాలతో సంబంధం ఉన్నట్లయితే పోయిన సొత్తు, తిరిగి లభించదు. 7వ భావం సబ్‌లార్డ్ 5-8-12 భావాలతో సంబంధం ఉన్న గ్రహాలలో ఉన్న మోసగింపబడతాడు.

## ఈ జాతకం జీవించియున్నవానిదేనా ?

పూర్వకాలంలో జ్యోతిష పండితులను, ఎన్నోవిధాల పరీక్షించేవారు. ఈ విషయం వృద్ధులద్వారా, పాత గ్రంథాల ద్వారా తెలియుచున్నది. ఆనాటి జ్యోతిష పండితులు వాటికి తట్టుకొని, తమ శాస్త్రప్రతిభను, భవిష్యదృష్టిని ఋజువు పరచుకొనేవారు. ఈవిషయంలో జ్యోతిషమును ప్రత్యక్షముగా ఆరోజునే ఋజువు పరచగలిగేది "ప్రశ్నశాస్త్రమే".

కె.పి.విధానంలో ప్రశ్నశాస్త్రమునకు ఎంతో ప్రాధాన్యమున్నది. జనన సమయం చాలా ఖచ్చితంగా లేనిదే, కె.పి.విధానంలో ఫలితాలు నూరుశాతం యధార్థంగా చెప్పడం జరగదు. ఎందుచేతనంటే, రెండు నిమిషాల తేడాలోనే భావం సబ్‌లార్డ్ మారిపోతాడు. గ్రహముల సబ్‌లు అంత త్వరగా మారవు.

కనుకనే 4స్టెప్ థియరీవల్ల ఫలితాలు చక్కగా వివరించవచ్చు. ఈ విధానంలో కూడా ఒక్కొక్కసారి భావములు జననసమయంలో తేడావల్ల, మారిపోతే ఆ భావముయొక్క ఫలితములు సరిగ్గారావు.

అందుచేతనే జననసమయాన్ని అనగా ఆ సమయానికి ఉన్న లగ్న - లగ్న నక్షత్రం సబ్, చంద్రనక్షత్రం చంద్రరాశి, వీటిని తత్కాల రూలింగ్ ప్లానెట్స్‌తో ఋజువు పరచుకోవాలి.

జననసమయం ఖచ్చితంగా లేనిదే కె.పిలో ఫలితాలు సరిగ్గారావు. ఇది యధార్థం. అందుకే ప్రశ్నశాస్త్రంలో కె.పి ద్వారా. పృచ్ఛకుడు చెప్పిన 249 సంఖ్యలోపు నెంబరు ననుసరించి, నూటికి నూరుశాతం చాలా ఖచ్చి తంగా చెప్పవచ్చు.

కె.పి. ప్రశ్నశాస్త్రమును, జ్యోతిషపండితులు నిరంతరం పరీక్షించు కుంటూ, త్వరగా, ఖచ్చితంగా ఫలితం చెప్పగలిగేలా "సాధన" చేయాలి. అందుకుగాను ప్రతీరోజూ జరుగు సాధారణ సంఘటనలను, తన ప్రశ్నజ్ఞాన బలముతో పరీక్షించుకుంటూ, అందులో జరుగు తప్పులను, సరిదిద్దుకుంటూ, జ్ఞానాన్ని అనుభవాన్ని అభివృద్ధి పరచుకోవాలి.

ఉదాహరణకు, కరెంటుపోయింది అది ఎప్పుడు వస్తుంది. ఈ విషయం రూలింగ్ ప్లానెట్స్‌వల్ల తెలుసుకోవచ్చు. డెలివరీ (ప్రసూతి) ఎప్పుడవుతుంది? లేదా ఇంటర్వ్యూ లెటర్ ఎపుడు వస్తుంది? వీటిని, 249లోపు నెంబరు

అనుకొని దానిననుసరించి, ప్రశ్నచక్రం భావములు, సబ్‌లు అన్నీ గుణించి తెలుసుకోవచ్చు.

249లోపు నెంబరు, మన లక్కీనెంబరును తీసుకోకూడదు. ఏదైనా 249 పేజీలు దాటిన పుస్తకం గ్రహించి దానిని రెండుచేతులతో పట్టుకొని, ప్రశ్నను మనసులో భావించి, ఏదో ఒక పేజీవచ్చేలా తెరవాలి. అందులో కుడివైపు పేజీ నెంబరును, ప్రశ్న సంఖ్యగా గ్రహించాలి.

ఒకవేళ పొరపాటున 249 దాటిన పేజీ నెంబరువస్తే, ఆ ప్రశ్న ఆ రోజున చూడరాదు. మరొక సారి ప్రయత్నం చేయరాదు.

"జ్యోతిషదీపిక వ్యా-3" సాఫ్ట్‌వేర్‌లో 249 ప్రశ్నవిధానం కూడా చాలా వివరంగా రూపొందించారు. 249 ప్రశ్నవిధానం చూడాలంటే, రాండామ్‌గా, ఒక సంఖ్యవచ్చేలా ఏర్పాటుచేశారు. ప్రశ్నబాక్స్ క్లిక్ చేయగానే 249లోపు ఏదో నెంబరు వస్తుంది. దాన్ని అనుసరించి చార్ట్‌బాక్స్‌ను క్లిక్‌చేస్తే మొత్తం ప్రశ్నజాతకం అంతా భావాలు, సబ్‌లు, దశాంతర్దశలు, రూలింగ్ ప్లానెట్స్‌తో సహా అన్నీ ఒకసెకనులో తెరపై వస్తాయి.

ఒక జాతకురాలు తనభర్త ఉద్యోగం గురించి ప్రశ్న వేయాలని వచ్చినపుడు, ఆమెచెప్పిన సంఖ్యకు వచ్చిన లగ్నానికి, సప్తమభావం భర్తలగ్నంగా భావించి, దానికి 10వ భావం సబ్‌లార్డ్ లేనిచో పరిశీలించాలి. జ్యోతిష దీపికలో ఈ ఏర్పాటు కూడా ఉన్నది. 12 భావాలలోనూ దేనినైనా, లగ్నంగా ఏర్పరచుకోవచ్చు.

అపుడు దాని ననుసరించే మరల పరివర్తిత భావం గ్రహాలు సబ్‌లు మొ॥ ఏర్పడతాయి. అలాగే జనన సమయాన్ని సరిచేసుకొనే సదుపాయం కూడా ఏర్పాటు చేశారు. ఏమీ పేపరు వర్క్ చేయనవసరం లేదు. గత రెండు సం॥ నుంచి దీనినే ఉపయోగిస్తున్నాను. చాలా సమయం కలసి వస్తోంది. శ్రమ తగ్గింది.

ఇక ఒకరు ఒకజాతకం తీసుకువచ్చారు. దాని గురించి ప్రశ్నించారు. అయితే ఆ జాతకం అసలు జీవించియున్నదానిదేనా ! లేక మరణించిన వానిదా? ఈ విషయం తెలుసుకోవాలంటే శాస్త్రంతోబాటు మన బుద్ధి కుశలత కూడా ఉపయోగించాలి.

దీన్ని ఎలా వివరించాలో ఏ గ్రంధములోనూ తెలుపబడలేదు. అయితే దీనికి కె.పి. విధానంలోనే ఒక సూత్రాన్ని సంపత్‌కుమార్ కనుగొన్నాడు. అనుభవంలో సరిపోయింది.

**సూత్రం : ప్రశ్నచూచు సమయానికి తత్కాల నక్షత్రం లగ్నం సబ్‌లార్డ్ జాతకుని వర్తమాన దశానాధుని, జాతకుని 8వ భావమును, 12వ భావమును సూచించిన, ఆ జాతకుడు జీవించలేదు. అది మరణించినవాని జాతకము.**

9వ భావం పూర్వపుణ్యమును తెలియజేయును అది ఖర్చుఅయిపోయిన, జీవుడు దేహమును వీడిపోవును. ఇక ప్రశ్న శాస్త్రములో చంద్రుని ప్రాధాన్యము అందరికీ తెలిసినదే. దీనిని పరీక్షించి చూడండి.

## విదేశ యోగం ఉన్నదా ?

ప్రశ్నలోగాని, జాతకచక్రంలోగాని విదేశీప్రయాణం నివాసం ఉన్నదీ లేనిదీ 12వ భావం సబ్‌లార్డ్‌ని బట్టి నిర్ణయించాలి. 12వ భావ సబ్‌లార్డ్ 3-9-12 భావాలకు సంబంధించినట్లయితే, ఆ జాతకుడు విదేశం వెడతాడు.

9వ భావం సబ్‌లార్డ్ 3-9-12 భావాలకు సంబంధించిననూ విదేశము వెళ్లుట సంభవించును. 9వ భావం దూరప్రయాణములు, కొత్త వాతావరణము తెలియుజేయును. 3వ భావం తన ఇంటినుండి ఎడబాటును తెలియ జేయును. 12వ భావం దూరప్రాంత ప్రవాసం, ఒంటరితనం తెలియ జేయును.

విదేశం ఎందునిమిత్తం వెళ్లడమో దాని కారణం 9వ భావం తెలియ జేస్తుంది. ఈ భావం 5-11 భావాలతో సంబంధించిన ఉల్లాసంగా, విహార యాత్రగా లేదా టూరిస్ట్‌గా వెళ్లడం జరుగుతుంది (బి1-బి2వీసా)

9వ భావం 1-6-12 భావాలకు సంబంధించిన, రోగ నివారణకు చికిత్స నిమిత్తం వెళతారు. 7-10 భావాలకు సంబంధించిన, ఒక లక్ష్యంతో స్వయం కృషితో ఉద్యోగ, వ్యాపార నిమిత్తం వెళతారు.

2-12 భావాలకు సంబంధించిన పెట్టుబడి, పొదుపు చేయుటకు వెళతారు. 5-10 భావాలకు మరియు శుక్రునితోనూ సంబంధం కలిగిన, కళాకారులుగా, నాట్యం సంగీతం మొ॥ ప్రదర్శనల నిమిత్తం వెళతారు.

4-5-10 భావాలకు శనికి సంబంధించిన ఆధ్యాత్మిక సాధనకు, వేదాంతాధ్యయనానికి వేదాంత సభలకు వెళతారు. 3-9-11 భావాలకు సంబంధించిన ఒప్పందాలపై సంతకాల నిమిత్తం వెళతారు.

8-12 భావాలకు - కుజ, శనులకు సంబంధించిన చట్టవ్యతిరేక కార్యకలాపాలు నిర్వహించడానికి వెళతారు.

ఉదా :- 1980-3-30; రాత్రి 7.05 జననం.

12వ భావం సబ్‌లార్డ్ శుక్రుడు. ఈ శుక్రడు లగ్నంలోఉండి, 12లో ఉన్న రవి నక్షత్రంలో ఉన్నాడు. రవి 6వ భావానికి అధిపతి (సర్వీస్ ఉద్యోగం) 5లో ఉన్న గురుని సబ్‌లో ఉన్నాడు. ఈ గురుడు 9-10 భావాలకు అధిపతి. 9లో గ్రహాలులేవు.

గురుడు 11లో ఉన్న కేతువు నక్షత్రంలో ఉన్నాడు. కేతువు శని భావంలో కుంభంలో ఉన్నాడు. 11-12 భావాలకు అధిపతి అయిన శనికి, కేతువు ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. ఇపుడు దీనిని 4 స్టెప్ థియరీలో ఇలా వ్రాసుకుంటే సులభంగా అర్థం అవుతుంది.

| శు 1 | - ర 12 | - గు 5 | - కే 11 |
|---|---|---|---|
| 2-7 | 6 | 9-10 | 11-12 |

ఇలా నక్షత్రం సబ్‌లెవెల్లో 12వ భావం సబ్‌లార్డ్ శుక్రునికి 3-9-12 భావాల సంబంధం కలిగింది. జాతకుడు ఉద్యోగం నిమిత్తం స్వయంకృషితో విదేశం వెళ్లడం జరిగింది.

ఈ శుక్రునికి 3 భావ సంబంధం ఎలా కలిగినదీ వివరిస్తాను. 3వ భవానికీ సబ్‌లార్డ్ కేతువే. ఈ కేతువు బుధునితో కలసి 11లో ఉండటం చేత, బుధుని స్థానములైన 3-4 భావాలకు ప్రాతినిధ్యం (ఏజెంట్) వహిస్తు న్నాడు.

భావచక్రం కె.పి. విధానంలో "ప్లాసిడస్ సిస్టం" రీత్యా భావ విభజన జరుగుతుంది. అందుచేత ఒక్కొక్కసారి కొన్ని గ్రహములకు, మేషాదివరుస క్రమంలో భావాధిపత్యాలు రావు.

ప్లాసిడస్ భావ విభజనరీత్యా ఈ జాతకునకు మిధున భావంలోనే 3-4 భావములు పడ్డాయి. ఎలాగంటే ? 3వ భావం 2-30-39 డిగ్రీలలో ప్రారంభం అయింది. 4వ భావం అదేమిధునంలో 27-54-40 డిగ్రీలలో ప్రారంభం అయింది. కన్యారాశి సాధారణం ఈ మేషలగ్నమునకు 6వ భావాధిపత్యం కావాలి. కాని, సింహంలో 28-18-52 డిగ్రీల నుంచి 6వ భావం ప్రారంభం అయి తులలో 5-1-32 వరకు ఏర్పడింది.

ఈ విధంగా 3వ భావ సంబంధం శుక్రునికి కలిగింది. మరొక విశేషం ఏమిటంటే, 9వ భావం సబ్‌లార్డ్ కూడా శుక్రుడే. ఈవిధంగా విదేశీ ప్రయాణం గూర్చి తెలుసుకోవాలి.

## గ్రీన్ కార్డ్ వస్తుందా ?

అమెరికాలో స్థిరనివాసం, అనగా అమెరికన్ పౌరసత్వం లభిస్తే గ్రీన్ కార్డ్ వస్తుంది. పూర్వ ఈ పౌరసత్వం గుర్తింపుకార్డు గ్రీన్ రంగులో ఉండేది. క్రమేణా ఆపేరే వాడుకలో స్థిరపడి పోయింది.

అమెరికన్ పౌరసత్వం లభిస్తే, ఎన్నో ప్రయోజనాలను ప్రభుత్వం కల్పి స్తుంది. పన్నుల చెల్లింపులో రాయితీలుంటాయి. కాలేజీఫీజులు, రాయి తీలు స్వంతంగా ఇల్లు నిర్మించుకోవడం, వ్యాపారం చేసుకోవడానికి హక్కు, ఇలా చాలా ప్రయోజనాలుంటాయి. విదేశీయోగం కలిగి ఉద్యోగం నిమిత్తమో? వ్యాపారం నిమిత్తమో ? టూరిస్ట్‌గానో వెళ్ళవచ్చు. కాని విదేశీ పౌరసత్వం, అది అమెరికా అయినా కావచ్చు, మరేదేశమైనా కావచ్చు. ఇతర దేశ పౌర సత్వం లభించాలంటే 12వ భావం సబ్‌లార్డ్‌నకు 1-3-9-10-12 భావాల సంబంధం ఉండితీరాలి.

కేవలం 3-12 భావాల సంబంధం ఉన్న జాతకుడు పూర్తి సంచార జీవితం గుడుపుతాడు. స్వస్థలం చేరడం జరగదు.

దూరప్రయాణాలకు, బుధ, శుక్రులు కారకులు, వీరిని కూడా పరిగణన లోనికి తీసుకుంటే ఫలితనిర్ధారణ మరింత ఖచ్చితంగా చేయవచ్చు. ఎక్కువ గ్రహములకు అనగా 6 లేదా 7,8 గ్రాహములకు సిగ్నిఫికేషన్ వచ్చినపుడు, రూలింగ్ ప్లానెట్స్ వేసుకొని ఫలితం నిర్ణయించాలి.

# గొప్ప సినీనటులు కావాలంటే?

నటనారంగం, సినీ టెలీ రంగాలలో నటులుగా రాణించాలంటే, 5వ భావం కస్ప్ సబ్‌లార్డ్ పరిశీలించాలి. ముఖ్య సూత్రం కె.పిలో ఏమిటంటే, 5వ భావ సబ్‌లార్డ్ 3-5-6-10-11 భావాలకు సంబంధించి ఉంటే ఆ జాతకుడు గొప్పనటుడవుతాడు.

ఇందులో 3వ భావం ధైర్యాన్ని, జ్ఞానాన్ని తెలియజేస్తుంది. 5వ భావం కళారంగంలో శ్రద్ధను, సామర్థ్యాన్ని 6వ భావం పనిని, విజయాన్ని, పారి తోషికమును, 10వ భావం వృత్తిని, హోదాను కీర్తి ప్రతిష్ఠలను, 11వ భావం సంతృప్తిని కోరికలు నెరవేరడం తెలియజేస్తుంది.

5వ భావం సబ్‌లార్డ్ 1-2-10-11 భావాలతో సంబంధం పొందితే అతడు గొప్పనటుడు లేదా గొప్ప నటి అవుతారు.

అదే 5వ భావ సబ్‌లార్డ్ 1-5-10 భావాలతో సంబంధం పొంది, వాటిలో ఏదో ఒకటి, సింహ, కుంభ, రాశులయినచో అట్టి జాతకుడు నటరత్న, సూపర్‌స్టార్ లెవెల్లో రాణిస్తాడు.

5వ భావం సబ్‌లార్డ్ శుక్రునితోనూ, లేదా గురునితోనూ, మరియు 1-5-10 భావాలతో సంబంధం పొంది, వాటిలోఏదో ఒకటి సింహ, కుంభ రాశులతోఅనుబంధించిన గొప్ప ఆకర్షణ ప్రజాభిమానం గల ప్రఖ్యాత నటు డగును.

అదే భావ సబ్‌లార్డ్ కుజునితో సంబంధించి, 1-5-10 భావాలతో సంబంధించిన ప్రతినాయక పాత్రలలో విలన్‌గా రాణించును. బుధునితో సంబంధించిన గొప్ప డ్యాన్సర్ అగును. అదే 5వ భావ సబ్‌లార్డ్ బుధ, శను లతో సంబంధించిన హాస్యనటుడగును.

5వ భావ సబ్‌లార్డ్ మేష, సింహ, కుంభ, రాశులకు సంబంధించిన గొప్ప నటుడగును. ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించును. ధనుస్సు, మిధునములకు సంబందించిన ప్రేక్షకుల ప్రశంసలుపొందును. కర్కాటక, మకరములకు సంబంధం కలిగినచో వైవిధ్యమున్న పాత్రలు ధరించి పరా జయం పొందును.

మిధున, కన్యలకు సంబంధించిన బరువైన, హుందాతనము కలిగిన పాత్రలు ధరించును. వృషభ, వృశ్చికములైనచో విలన్ దుష్టపాత్రలు పోషించును. ధనుస్సు, మీనములైనచో జానపద, పౌరాణిక పాత్రలు ధరించును.

5వ భావం సబ్‌లార్డ్ చరరాశికి, సంబంధించిన సినీఫీల్డులోగొప్పగా రాణించును. స్థిరరాశులకు అనుబంధం కలిగిన ఒకేవిధమైన పాత్రలు నటించవలసివచ్చును. ద్విస్వభావరాశికి సంబంధించిన, అనేక వైవిధ్య భరితమైన పాత్రలు ధరించి పేరు ప్రఖ్యాతులను ప్రజాదరణను పొందును.

జరుగుచున్న దశననుసరించి కూడా, కొంత కాలము ఒకే రకమైన పాత్రలు ధరించి, అటుపిమ్మట వైవిధ్యంగల పాత్రలు ధరించుట కూడా జరుగును. కనుక దశను కూడా పరిగణనలోనికి తీసుకోవాలి.

## వైఫల్యం

5వ భావసబ్‌లార్డ్ 5-8-9-12 భావాలకుసంబంధించినచోఆయా దశా భుక్తి అంతరములందు పరాజయమును పొందును.

లగ్నం సబ్‌లార్డ్ 1-2-5-10-11 భావాలతోసంబంధం లేకుండా, 5వ భావ సబ్‌లార్డ్ 1-2-5-10-11 భావాలతో సంబంధించిన ఆ దశాంతర్దశలందుమాత్రమే సినీరంగములో రాణించును.

ఇపుడు ప్రఖ్యాత నటుల జాతకములను ఉదాహరణగా వివరిస్తాను.

ఉదా:- నటరత్న ఎన్.టి.ఆర్.

జననం - 28-5-1923;సా 4-43; 81-08 E ; 16.3 N

5వ భావం సబ్‌లార్డ్ గురుడు, 11వ భావానికేసబ్‌లార్డ్ గురుడే, 3-6 భావాలకు అధిపతి అయ్యాడు. 3లోగ్రహాలులేవు.

గు12 - రా 11 - చ 12 - రా 11

గురుదశ 1940 వరకు జరిగింది. 1940 నుంచి శనిమహాదశ 1959 వరకూ చాలాబాగా యోగించింది. శని 4-5 భావాలకు అధిపతి అయి, ఏ భావాలకూ సబ్‌లార్డ్ కాలేదు, శని నక్షత్రములలోఏ ఇతర గ్రహములూ లేవు.

శని, రాహువుతో కలసి11లో ఉన్నాడు. శనిలో స్వభుక్తి 1943 వరకు మినహాయించి, బుధాంతరం నుంచి, దశాంతం వరకువిశేషంగా యోగించింది.

శ 11 - చ 12 - శు 6 - శు 6

సినిమారంగానికి కారకుడైన శుక్రుడు సర్వీస్ (చేసేపని) స్థానమైన 6లో ఉన్నాడు. శనికూడా శుక్రుడి సబ్‌లో ఉన్నాడు. ఈ శుక్రుడు మరల తన నక్షత్రంలో ఉన్నాడు.

ఇక వృత్తి, హోదాల భావమైన దశమభావానికి, సబ్ లార్డ్ కేతువు అయ్యాడు. కేతువు 5లో ఉండి, 2వ భావానికే సబ్‌లార్డ్ అయ్యాడు. కేతువు శనిస్థానమైన 5వ భావంలోఉండటంచేత, శనికి ఏజంటు అయి, శని శుభ ఫలితాలనుకూడా తానూ ఇచ్చాడు.

5వ భావం సబ్‌లార్డ్ గురుడు, చరరాశి అయిన తులలోఉండుటచేత, ఎంతో ప్రఖ్యాతి కలిగినది. అనేక రకములైన, వైవిధ్యభరిత పాత్రలు ధరించి రాణించెను.

**ఉదా :- సూపర్‌స్టార్ కృష్ణ; సింహలగ్నం, భరణీనక్షత్రం**

జననం : 31-5-1943; మ 12-10

5వ భావం సబ్‌లార్డ్ - చంద్రుడు, 1-5-9 భావాలకు కూడా సబ్ లార్డ్ అయ్యాడు. ఇది గొప్ప అదృష్టం.

1వ భావం సింహం; 5వ భావ సబ్‌లార్డ్ అయిన చంద్రుడు 3-10 భావాలకు అధిపతి అయి 11వ భావంలో ఉన్న శుక్రుని నక్షత్రంలో ఉన్నాడు. శుక్రుని సబ్‌లో ఉన్నాడు. అందుచేత చంద్రునికి 3-10-11-1-5-9 భావాలతో బలమైన సంబంధం ఏర్పడటంవల్ల గొప్పనటుడిగా రాణించి, ప్రేక్షకుల ఆదరాభిమానాలు, వైవిధ్యమున్న ఎన్నో పాత్రలు ధరించాడు.

చ 8 - శు 11 - శు 11 - గు 11

(12) (3-10) చంద్రుడికి 12వ ఆధిపత్యం రావడంవల్ల పరాజయాలు కూడా కలిగాయి. చంద్రదశ 1967 ఏప్రిల్ నుంచి 1977 వరకూ జరిగింది. చంద్రుడు 11లో వున్న శుక్రుడి నక్షత్రం, శుక్రుని సబ్‌లో ఉండటంచేత, చంద్రదశ ఎంతో బాగా యోగించింది. అదే గోల్డెన్ పిరియడ్ అని చెప్పవచ్చు.

4స్టెప్ థియరీ రీత్యా చంద్రుడు పూర్తి యోగకారకుడయ్యాడు.

శుక్రుడు 3-7-11 భావాలకు సబ్‌లార్డ్ అయ్యాడు. కనుక నిర్మాతగా కూడా రాణించాడు. దేవుడు చేసిన మనుషులు, అల్లూరి సీతారామరాజు మొ॥ సినిమాలు ఈ కాలంలో నిర్మించినవే.

లగ్నం సబ్‌లార్డ్ చంద్రుడు కావడంవల్ల మంచి మనస్సు, గొప్ప వ్యక్తిత్వం సహజంగానే కలిగాయి. ఇట్టి చంద్రుడు 11లో వున్న శుక్రుని నక్షత్రంలో శుక్రుని సబ్‌లో ఉండటం వల్ల వివిధ సినీశాఖలలో విజ్ఞానం, భోగ భాగ్యాలు కలిగాయి. ప్రస్తుతం 2018 నవంబర్ వరకు గురుదశ జరుగుచున్నది.

**ఉదా:- భానుమతి; వృషభలగ్నం; భరణీ నక్షత్రం**

జననం - 7-9-1925; రాత్రి 11-45 దొడ్డపాడు ఒంగోలుజిల్లా.

మరణం 24-12-2005 బు/కే/శ/బు

5వ భావంసబ్‌లార్డ్ బుధుడు, 3వ భావంలోఉన్నాడు. 8కేస్టార్‌లో చం 12 సబ్‌లో ఉన్నాడు.

ఫోర్‌స్టెప్‌థియరీప్రకారం బుధునికిబలంగా 3-5సంబంధం కలిగింది.

3బు- కే 8 - చ 12 - శు5

శుక్రుని నక్షత్రంలోవున్న చంద్ర, కుజ, దశలూ, శుక్రునిసబ్‌లోఉన్న రాహుదశ,శుక్రుని నక్షత్రంలో ఉన్న గురుని దశ, సుమారుగా 1983వరకూ యోగిస్తూనే జరిగాయి.

ఉదా:-నాగార్జున; వృషభలగ్నం; ఆర్ద్ర నక్షత్రం

జననం : 29-8-1959; మ 12-27 ; చెన్నై

5వభావం సబ్‌లార్డ్ బుధుడు, 3వ భావంలోఉండి, అందున్న బుధుని నక్షత్రంలో ఫోర్‌స్టెప్ థియరీ ప్రకారం.

3 బు - 3 బు - 4 రా - 1 చ

ఇలా 1 - 3 - 4భావాల సంబంధం కలిగింది.

7వ భావం - 4 కు - 13 బు - రా 4

మార్చి 1991 వరకు గురుదశ - గు 6 - గు 6 - కు4 - ర3

మార్చి 2010 వరకు శని దశ - శ 7 - కే10 - రా 7 - చ 1

## త్రికోణ స్థానాలు

రాశిచక్రంలోని 12 స్థానాలకు, మూడేసి పరస్పర త్రికోణస్థానాలుగా, 4 త్రికోణములు ఏర్పడతాయి. ఇవి వరసుగా ఈ స్థానములు.

1 = 1-5-9

2 = 2-6-10

3 = 3 7- 11

4 = 4-8-12

వీటిలో 4-8-12 స్థానాలు వాహనాదులవల్ల ప్రమాదాలు, ఆసుపత్రిలో చేరి చికిత్స పొందడంవంటివి తెలియజేస్తాయి. ఈ 4-8-12 త్రికోణం గూర్చి, గతంలో ఒకసారి వివరించాను. ఇపుడు మరొక త్రికోణమైన 1-5-9 గూర్చి వివరిస్తాను.

4-8-12 అశుభాన్ని తెలియజేస్తే, ఈ 1-5-9 త్రికోణం శుభంగూర్చి తెలియజేస్తుంది. 1వస్థానం లగ్నంగాయుండి జాతకుని శరీరం, ఆరోగ్యం, అభిరుచి సూచిస్తుంది. 5వ స్థానం పుత్రులు, తెలివి, మంత్రోపాసన, చాతుర్యం వెల్లడిస్తుంది. 9వ స్థానం, తన తండ్రిని పూర్వపుణ్యము, మనుమలు వీరిని గూర్చి, మరియు దూర ప్రయాణము పరిశోధన గూర్చి కూడా వివరిస్తుంది.

ఈ త్రికోణములు గతజన్మ మరుసటి జన్మలను కూడా ఇలా తెలియజేస్తాయి. ఒకసారి ఈ చక్రం పరిశీలించండి. జాతకుడు వృశ్చికలగ్నం అనుకోండి. అపుడు 3 ఆ వృత్తాలుగా 12 భావాలు ఇలా లిఖించాలి.

అందు మొదటి ఆవృత్తంలో 1 నుండి 12 వరకు గల భావాలు ఈ జన్మకు సంబంధించిన ఫలితాలను వివరిస్తాయి. రెండవ ఆవృత్తంలో 9వ స్థానం నుంచి 12 భావాలులిఖించాలి. అది గతజన్మలోని వివరాలు సూచి

స్తుంది. ఇపుడు 3వ ఆవృత్తంలో 5వ స్థానం నుంచి 12 భావాలు లిఖించగా, అది భవిష్యజన్మ ఫలితములను తెలియజేస్తుంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | 2 10 | 3 11 | 4 12 | |
| భవిష్యజన్మ 1, 9 | 5 | 6 | 7 | 8 | |
| 12, 8 | 4 | | | 9 | 1 గతజన్మ; 5 |
| 11,7 | 3 | | | 10 | 2, 6 |
| | 2 | ప్రస్తుత 1 జన్మలగ్నం | 12 | 11 | 3,7 |
| | 6 10 | 5 9 | 4 8 | | |

ఈ జన్మ జాతకచక్రంలో 1-5-9 స్థానాలు బలహీనంగా ఉంటే, దోష పరిహారాలు (రెమిడీస్) పనిచేయవు.

భారతీయ ఆచారాల్లో,నైమిత్తిక కర్మలలో, పితృ దేవతలనర్చించడం ఒక విధి. ప్రతీ సం॥ము తల్లిదండ్రులకు శ్రాద్ధం వారు చనిపోయిన తిథినాడు ఆచరిస్తారు. వివాహాది శుభకార్యాల్లో కూడా పితృదేవతల ఆశీర్వాదం పొంద డానికి "నాందీశ్రాద్ధం" ముందుగా తప్పకుండా నిర్వహిస్తారు. అయితే నాందీ శ్రాద్ధంలో నువ్వులు వినియోగించరు. పితృతర్పణాల్లో నువ్వులు నీళ్లు ఉపయో గిస్తారు. ఇవే చాలా ముఖ్యమైనవి.

నువ్వులు విష్ణుస్వరూపము, కశ్యప ప్రజాపతి నుంచి ఉద్భవించినవి. తల్లిదండ్రులకు శ్రాద్ధం పెట్టలేని దరిద్రుడు, నువ్వుచేలలో కూర్చుని, బాధతో ఏడ్చినచో ఆ కన్నీరే పితృ తర్పణమగునని, అది శ్రాద్ధముతో సమానమని "ధర్మశాస్త్రము" ఉల్లేఖించుచున్నది.

ఇట్టి పితృదేవతల శ్రాద్ధములలోపితృ పితామహ ప్రపితామహులను ఆహ్వానిస్తారు. ముందుగా మొదటి తల్లి లేదా తండ్రిని ఆహ్వానిస్తారు వీరు "వసులోకం"లో ఉంటారు. ఆపై తాత (తండ్రి తండ్రి) మామ్మ (తండ్రి

యొక్క తల్లి) ను ఆహ్వానిస్తారు. వీరు 'రుద్రలోకం'లో ఉంటారు. చివరిగా ముత్తాత (తాతయొక్కతండ్రి) తాతమ్మ (తాతయొక్క అమ్మ)ను ఆహ్వానిస్తారు. వీరు 'ఆదిత్యలోకం'లో ఉంటారు.

ఈ విదంగా 3 గురు పితృదేవతలూ, వసురుద్ర, ఆదిత్యస్వరూపులు. ఇక తల్లికి శ్రాద్ధం ఆచరించేటప్పుడు మాత్రం, తల్లి, తల్లియొక్క అత్తగారు, తల్లియొక్క అత్తగారి అత్తగారు, వసు, రుద్ర, ఆదిత్య స్వరూపులుగా పరిగణింప బడతారు.

దేవకార్యం కంటే పితృకార్యం గొప్పది. పితృకార్యం శ్రద్ధగా ఆచరించినచో, పితృదేవతల అనుగ్రహము కలిగి జాతకునికి శుభములు కలుగును. వారి ఆగ్రహమువలన అశుభములు, కష్టములు కలుగును. ఈవిషయములు లగ్నముయొక్క బాధకస్థానమువలన తెలియును.

నేడు, నూతనముగా గృహము నిర్మించుకొన్నవారు, మొదటి సంవత్సరములో తల్లి దండ్రుల శ్రాద్ధము ఆచరించుటకు, అది అశుభమేమో అని స్వగృహమునందు ఆచరించక, మరొకచోట నిర్వహించుచున్నారు. **అతి చాలా తప్పు, స్వగృహములో పితృకర్మల నాచరించుట చాలా శ్రేష్ఠము. అది ఒక యోగము.**

ఈవిధముగా త్రికోణస్థానములు, ప్రతీభావమునకు పరిశీలించియే ఫలిత నిర్ధారణ చేయవలయును. వివాహమునకు 2-7-11, ఉద్యోగానికి 2-6-10 సంతానమునకు 2-5-11 ఇలా మూడు భావాలు పరిశీలించాలి.

## అభివృద్ధి కలిగించు భావాలు

కె.కృష్ణమూర్తి గారు (కె.ఎస్.కె.) 2వరీడర్ 133 పేజీలో ఇలా వివరించారు. ఒకభావాన్ని పరిశీలించేటప్పుడు, దానికి వ్యతిరేకఫలితమిచ్చు దాని సప్తమభావం కూడా పరిశీలించాలి.

12 భావాలలో 6 భావాలు అభివృద్ధిని కలిగిస్తాయి. అవి 1-2-3-6-10-11 అలాగే క్షీణత్వాన్ని విపరీత ఫలితాన్ని 6 భావాలు కలిగిస్తాయి అవి 7-8-9-12-4-5.

అయితే వివాహనిర్ణయంలో 6–4 స్థానాలు మంచివికావు. 6వ స్థానం 7వ భావానికి వ్యయం కనుక అది వియోగాన్ని సూచిస్తుంది. 6వ భావ సంబంధఅంతర్దశలో వివాహం కానేకాదు. అలాగే సంతానం పొందడానికి4వ భావం అభివృద్ధి సూచకం కాదు. అది సంతానభావమైన 5వ భావానికివ్యయం (12) కనుక.

జన్మచక్రమైనా, హోరాచక్రమైనా, ఏ గ్రహమైనా 1–2–3–6–10–11 భావములను సంబంధించిన గ్రహముల సబ్‌లలోఉంటే, ఆ జాతకుడు అన్ని విధాలా సుఖసంతోషములు పొందుతాడు. దీనికి బాధకులు మినహాయింపు, చరలగ్నాలకు 11వ స్థానం బాధకస్థానం కనుక, వీరికి శుభాశుభములు రెండూ సంభవిస్తాయి.

అదేవిధంగా జాతకచక్రంలో గ్రహములు, 7–8–9–12–4–5 భావ సంబంధ గ్రహముల సబ్‌లో ఉన్నచో అట్టి జాతకుడు దుఃఖములు, కష్టములు, దరిద్రము మొ॥ క్షీణ ఫలితములు పొందును.

వివాహమునకు 7వ సబ్ మంచిది, సంతానమును పొందుటకు 5వ సబ్, ఉన్నతవిద్యకు 9వ సబ్, విదేశీ ప్రయాణమునకు 12వ సబ్ మంచివి.

వివాహ విషయం పరిశీలించేటప్పుడు, సమయ నిర్ధారణ చేయునపుడు 4–6–10 భావ సంబంధగ్రహ అంతర్దశలు ఫలించవు. 4వ భావం నుయ్యి త్రవ్వేటప్పుడు రాయి అడ్డం పడటం వంటిది.. అలాగే 10వ భావం వేగంగా ఫలితం ఇవ్వదు.

గ్రహములు తమ తమ ఉచ్ఛస్థానములు పొందినపుడు వాటికి, ఉచ్ఛ స్థానమునకు సప్తమస్థానం నీచస్థానంగా చెప్పబడినది.

ఎవరైనా తాము కోర్టుకేసు విజయం పొందుతామా? అని ప్రశ్నించి నపుడు లగ్నాన్ని ముందుగా సప్తమభావంతో పోల్చి వాటి బలాబలాలు నిర్ణ యించాలి. పృచ్ఛకుని లగ్నం బలంగా యుండి 2–3–6–10–11భావాలకు సంబంధించియుంటే కేసు తప్పక గెలుస్తారు.

ప్రతివాది స్థానమైన సప్తమం బలంగాయుండి నట్లయితే అతడు గెలు స్తాడు. 3–9 భావాలకు లగ్న సప్తమాలు సంబంధం పొందినట్లయితే ఇద్దరూ రాజీపడతారు. పరస్పర సప్తమాలు సంబంధం పొందితే గట్టిపోటీ. ఇందులో

4-10 భావాల సంబంధంవల్ల లిటిగేషన్, కుతంత్రాలు చోటు చేసుకుం టాయి.

10వ స్థానంరెండు విధాలయిన పాత్రపోషిస్తుంది. ఒకటి ఇది కేంద్రా లలో గొప్పది, మరియు ఇచ్చటనున్న గ్రహంశుభఫలితమిస్తుంది. రవి, కుజులు 10లో దిగ్బలాన్ని పొందుతారు. అయితే ఇది లాభానికి (11)వ్యయం, 11వ భావ సూచకగ్రహం 10లో ఉంటే శుభఫలితమివ్వదు. కాని అది ఉన్న నక్షత్రాధిపతి, ఇతర శుభస్థానంలో ఉంటే మాత్రం శుభ ఫలితాల నిస్తుంది.

## దశాంతర్దశల ఫలితాలు - గ్రహ దృష్టులు

గ్రహాలు తామున్న నక్షత్రాధిపతుల ఫలితాలనివ్వడంలో ఇతర గ్రహముల దృష్టులు కూడా ఎంతో ప్రముఖపాత్ర వహిస్తాయి. సంప్రదాయభారతీయ జ్యోతిషంలో అన్నిగ్రహాలు సప్తమ స్థానం చూస్తాయి. కు,శ,గు,రా,కేతువులకు విశేష దృష్టులుచెప్పబడ్డాయి.

అయితే కె.పి.లో పాశ్చాత్య దృష్టివిధానం కూడా పరిగణనలోనికి తీసుకోవాలని, కృష్ణమూర్తిగారు సూచించారు. భావ విధానం కూడా, పాశ్చాత్య పద్ధతి "ప్లాసిడస్" విధానమే వారు స్వీకరించారు. శ్రీపతి భావ విభజన పద్ధతి, రెజియోమోంటానిస్ భావ విభజన పద్ధతులు శాస్త్రీయం కావని నిరూపించారు.

ఈ విధానంలో గ్రహముల గతివేగం కూడా పరిశీలించారు. అత్యంత వేగ గతి గల గ్రహము చంద్రుడు, ఆ తరువాత బుధుడు, శుక్రుడు వస్తారు. అత్యంత మందగతి గల గ్రహము శని. శుక్ర శనులు పరస్పర సమసప్తక దృష్టిలో ఉన్నపుడు, వారిలో తీవ్రగతిగల గ్రహమే చూచుచున్న గ్రహమని, తక్కువ వేగంగల గ్రహము చూడబడుచున్న గ్రహమని గ్రహించాలి.

ఆర్బిట్ (పరిధి)లో గ్రహములు సంచరించునపుడు, మరొక గ్రహముతో కొద్ది డిగ్రీల దూరం (ఆర్బ్)లో ఉన్నపుడు, ప్రత్యేకమైన దృష్టులుగా, పాశ్చా త్యులు పరిగణించారు. వీటిలో కొన్ని శుభప్రదమైనవి, కొన్ని అశుభదాయక ములు అగును.

మేషంలో ఉన్నగ్రహము వృషభ, మిధున క్రమంలో ఉన్న గ్రహమును చూచుట సినిస్టర్ (పాపదృష్టి)గాను, వెనుకకు మీన, కుంభంలో ఉన్నగ్రహ

మును చూచుట డెక్స్టర్ (కార్యసాధన శుభదృష్టి) గాను చెప్పబడింది. వీటిలో శుభగ్రహాల శుక్రుని మొ॥వారి సినిస్టర్ దృష్టి, కుజుడు మొ॥పాపగ్రహాల డెక్సుటర్ దృష్టి ఎంతో శక్తివంతమైనవి.

ఒకే ఆర్బ్‌లో ఉన్నదృష్టి బలహీనమైనది. కాని ఒక గ్రహము దూరమైన ఆర్బ్ నుండి, మరొక గ్రహము వద్దకు దగ్గరగా వచ్చే కొలదీ, అదిశక్తివంత మగుచుండును.

ఇక గ్రహముల కలయిక (కంజక్షన్) విషయంలో రవి తానున్న డిగ్రీల నుండి 12 డిగ్రీలవరకు తన ప్రభావం చూపించును. 17 డిగ్రీల దూరం జరిగినపుడు రవితో కలసిన గ్రహము రవియొక్క ప్రభావమునుండి బయట పడును. రవితో కలసిన గ్రహము, అస్తంగతమని సంప్రదాయ జ్యోతిషము వివరించగా, పాశ్చాత్యులు దీనిని కంబస్టన్ అని వ్యవహరించారు.

ఇతర గ్రహాలు తామున్న డిగ్రీనుండి 6 డిగ్రీలవరకు, కలయిక అని చెప్పబడును. 8 డిగ్రీల దూరం జరిగిన కలయికగా చెప్పబడదు. ఇపుడు పాశ్చాత్యుల డిగ్రీల వారీగా దృష్టి, వాటి ఫలితము వివరించబడుచున్నది. ఇది ఎంతో ముఖ్యమైన విషయము.

| కంజక్షన్ | ఒకే డిగ్రీలోవున్న2గ్రహాలు | వివిధ ఫలితాలు | $8^0$ఆర్బ్ |
|---|---|---|---|
| అపోజిషన్ | 180 డిగ్రీల దూరం | అశుభం | 8 |
| ట్రైన్ | 120 డిగ్రీల దృష్టి | అతిశుభం | 8 |
| స్క్వేర్ | 90 డిగ్రీల దృష్టి | అతిపాపదృష్టి | 8 |
| సెక్స్టైల్ | 60 డిగ్రీల దృష్టి | అతి శుభం | 4 |
| సెమిస్క్వేర్ | 45 డిగ్రీల దృష్టి | స్వల్ప పాపం | 4 |
| సెమి సెక్స్టైల్ | 30 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 4 |
| క్విన్ కంక్స్ | 150 డిగ్రీల దృష్టి | స్వల్పప్రతికూలం | 2 |
| క్విన్ టైల్ | 72 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 4 |
| సెస్క్విక్వాడ్రేట్ | 135 డిగ్రీల దృష్టి | స్వల్పప్రతికూలం | 2 |
| బైక్విన్‌టైల్ | 144 డిగ్రీల దృష్టి | స్వల్పశుభం | 2 |
| ట్రాడిసైల్ | 108 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 2 |
| డెసైల్ | 36 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 2 |
| క్విన్‌డెసైల్ | 24 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 2 |
| విజిన్ టైల్ | 18 డిగ్రీల దృష్టి | స్వల్ప శుభం | 2 |
| పారలల్ | డిక్లైన్ ఒకేస్థాయితో | వివిధరకాలు | 1 |

దశాంతర్దశల ఫలితాలు, దశానాధుని, అంతర్దశానాధుని పరస్పర డిగ్రీల దూరం పరిశీలించినపుడే ఖచ్చితంగా వివరించడం వీలవుతుంది.

## నక్షత్ర నియమం

గ్రహము ఏరాశి ఉన్నా, ఆరాశి ఫలితాలు అనగా తానున్నరాశి లేదా భావ ఫలితాలను ఇస్తుందనేది ప్రాచీన సిద్ధాంతమే. కాని దీనిని మరింత, సునిశితంగా పరిశోధించి శ్రీకృష్ణమూర్తి వివరించారు. విషయ దారుఢ్యం కోసం, దీనిని మరొకసారి తెలియజేస్తాను.

భావంలో ఉన్నగ్రహం, తన నక్షత్రములో ఏ గ్రహమూ లేనపుడే తానున్న భావఫలితాలను ఇస్తుందనేది కె.పి.నియమ సూత్రం తన స్వంత ఆధిపత్య భావములలో ఇతర గ్రహాలులేనపుడే, ఆ భావఫలితాలు సంపూర్ణంగా ఇస్తాడు. గ్రహములున్నచో ఆ భావ ఫలితములు కొంతమేర మాత్రమేఇచ్చును.

భావంలో ఉన్న గ్రహం, ఆ భావంలోని మూడు నక్షత్రాలలో, ఏ నక్షత్ర ములో ఉండు దానిననుసరించి ఫలితములు మూడు విధములుగా నుండును. అతి ఎంతమేర శుభము అనునది సబ్‌లార్డ్ నిర్ణయించును. ఉదా:- వృషభ లగ్న జాతకునికి, శనిదశ జరుగుచున్నది. ప్రాచీన సిద్ధాంతరీత్యా యోగకార కుడే, కాని ఈ శని వృషభంలోని 3 నక్షత్రాలైన కృత్తిక, రోహిణి, మృగశిర లలో 12-7 అధిపతి అయిన కుజుని నక్షత్రమైన మృగశిరలో ఉన్నాడు. వ్యాపారంలో నష్టం, అప్పుల బాధ, కలిగాయి. (7 వ్యాపారం, 12 నష్టం)

కన్యాలగ్నజాతకునికి బుధుడు, ఉత్తరలో ఉంటే ఆలస్యం, అనారోగ్యం, మనోవ్యధ కలుగుతాయి. హస్తలో ఉంటే (చంద్రుడు 11వ లాభాధిపతి) ఆరోగ్యం, లాభం కలుగుతాయి.

తులాలగ్నజాతకునికి, కుజుడు వృశ్చికంలో ఉండి బుధుని నక్షత్రమైన జ్యేష్ఠలో ఉన్నాడు. ఈ దశలో జాతకుడు విదేశాలలో విద్యనభ్యసించాడు. కుజుడున్న నక్షత్రాధిపతి బుధుడు ఉన్నతవిద్య 9 విదేశం 12 భావాలకు అధిపతి కావడమే. అన్నిటినీ ఇలాగే పరిశీలించాలి.

## 'జ్యోతిష' రీత్యా పునర్జన్మ నిరూపణ

విశ్వాసం, నమ్మకం తర్కాన్ని ఆధారం చేసుకొని మాత్రమే ఆదరింపబడు తున్నాయి. తర్కహీనమైన విశ్వాసము అంధ విశ్వాసముని, కారణరహితమైన నమ్మకం, మూఢ నమ్మకమని పెద్దలు చెబుతారు.

మరణానంతరం పునర్జన్మ అనేది తర్కబద్ధమైన యధార్థం. తార్కిక ఆలోచనతో కూడిన విశ్వాసం. ఇందుకు ప్రపంచంలోని అన్ని దేశాలలోనూ కోకొల్లలుగా ఎన్నో ఉదాహరణలున్నాయి.

భగవంతుని అస్తిత్వాన్ని నిరాకరించిన కొన్ని ప్రాచీన శాస్త్రాలు సైతం పునర్జన్మను అంగీకరించాయి. పుట్టడానికి ముందు ఎక్కడ ఉన్నాము. అంటే ఎక్కడ నుంచి వచ్చాము? చనిపోయిన తరువాత ఎక్కడకు వెడతాము? ఇత్యాది ప్రశ్నలు ఎందరినోకాదు, అందరినీ ఎప్పుడో ఒకప్పుడు ఆలోచింప చేస్తాయి ?

పునర్జన్మ ఉన్నదని, జీవుడు అనగా ఆత్మ తన ప్రబలమైన ఇచ్ఛానుసారం తిరిగి జన్మిస్తుందని, ఈ వాసమునందు నిరూపించుటకు ప్రయత్నం చేయ బడింది. కర్మానుసారం ఫలం అనుభవించడాని పునర్జన్మ తప్పదని భారతీ యుల తరతరాల విశ్వాసం.

కనుకనే భారతదేశానికి కర్మభూమి అనిపేరు వచ్చినది. అనేక లక్షల జీవులలో మానవజన్మ ఎంతో విశిష్టమైనది. జన్మలక్ష్యం మోక్షసాధనమే. మోక్షమంటే తిరిగి జన్మించకుండా లయం కావడమే.

ఒక విధంగా చెప్పాలంటే ఈ పునర్జన్మ అను విషయం గూర్చి వ్రాయా లంటే ఎన్నివేల పేజీలైనా వ్రాయవచ్చు. కాని అతిముఖ్యమైన, శాస్త్రబద్ధమైన అనుభవ గోచరమైన కొన్ని విషయాలను మాత్రమే ప్రస్తుతించడం జరిగింది.

మానవుడు తన కోరికలన్నిటినీ జీరోస్థాయికి తెచ్చుకొన్నపుడు, ఏవిధ మైన కర్మబంధనలూ లేక, కర్మఫలము ఏర్పడుటకు వీలులేక, జన్మ రాహిత్యం కలుగుతోంది. అదే అసలైన సారాంశం.

ముందుగా యదార్థంగా జరిగిన ఒక పునర్జన్మ సంఘటన గూర్చి వివరిస్తాను. అయితే ఇందులో ఒక విశేషమున్నది. అది ఏమిటంటే, జ్యోతిష శాస్త్రరీత్యా లగ్నము ఈ జన్మగూర్చి, నవమస్థానము గత జన్మగూర్చి, పంచమ స్థానము భవిష్య జన్మగూర్చి తెలియజేయును.

ఈ పునర్జన్మ సంఘటన జ్యోతిషశాస్త్ర ఆధారంగా చక్కగా వివేచన చేయబడింది. ఇది "అస్ట్రలాజికల్ మేగజైన్" 1986 జనవరి సంచికలో ఉమాశంకర్ దూబే వివరించారు.

కాన్పూర్ హిందీ దినపత్రిక జాగరణ్, ఆజ్ మొ॥ పత్రికలలో 18-2-1983లో ఈ సంఘటన ప్రచురింపబడినది. తరువాత పారాసైకాల జిస్టులు, ఔత్సాహిక పరిశోధకులు ఈ విషయంగూర్చి చర్చించారు. అయితే ఈ సంఘటనలోని యధార్థాన్ని గమనించి దానిని జ్యోతిషశాస్త్రరీత్యా విశ్లేషించారు.

కాన్పూర్‌లోని ప్రేమనగర్‌లో సుఖదేవ్ రాయ్ సిన్హా అనే వ్యక్తికి 1953 మార్చి 21న ఒక ఆడపిల్ల పుట్టింది. ఆమెకు సుధ అనిపేరు పెట్టారు. ఆమె పెరిగి పెద్దదైన తరువాత ఆమెను డా. వినయ్ సక్సేనా (హార్డోయ్‌నివాసి) అనే వ్యక్తితో 1975 మార్చిలో వివాహం చేసారు. ఈ దంపతులకు ఒక కుమార్తె జన్మించింది.

అయితే డాక్టర్ అయిన వినయ్ ఒక నర్సుతో అక్రమ సంబంధం ఏర్పరచుకున్నాడు. నర్సుమీద వ్యామోహంతో ఆమెను పెళ్లిచేసుకోవాలని, భార్య అయిన సుధను అడ్డు తప్పించుకోవాలని 1978 అక్టోబర్ 25న గొంతు పిసికి హత్యచేసి, ఒక ట్రంకుపెట్టిలో ఆమెశవాన్ని ఉంచి, రైలులో ప్రయాణిస్తూ బ్రిడ్జిపైనుంచి గంగానదిలో ఆ ట్రంకుపెట్టి పడేశాడు. అయితే అది నీటిలో పడకుండా బ్రిడ్జిలో చిక్కుకుపోయింది.

తరువాత అది తెరువబడి అందు శవాన్ని గమనించి, పోలీసులు పరిశోధించి డాక్టర్‌నూ, నర్సునూ అరెస్ట్ చేశారు. తరువాత అతనికి జీవితశిక్ష విధించబడింది.

ఉన్నావ్ జిల్లాలో బెతర్ అనేగ్రామంలో ఇంద్రమోహన్ అనే వ్యక్తికి 1979 డిశంబర్ 19 ఉదయం 3 గం॥ ఒక ఆడపిల్ల పుట్టింది. ఆమెకు మీనూ అనిపేరు పెట్టాడు. 1982 నవంబర్‌లో మూడేళ్ల వయసుగల మీనూ తాను కాన్పూర్‌లోని ప్రేమనగర్ నివాసినని, తనకు అక్కడ తన తండ్రివద్ద అనేక చీరలున్నాయని చెప్పడం ప్రారంభించింది. ఏదో బాల్యచేష్టలుగా భావించి ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. కాని రోజూ అలాగే చెబుతుండటంతో ఆమెను కాన్పూర్ తీసుకువెళ్లారు. అక్కడ ఆమె తల్లిదండ్రులను, సోదరులను, బంధువులను ఇరుగు పొరుగు వారిని అందరినీ గుర్తించింది. ఆ తరువాత తనను తనభర్త నోటిలో గుడ్డలు కుక్కి ఎలా హత్యచేసినదీ తన ఎడమచేతిలో ఎలాప్రతిఘటించినదీ వివరించింది.

ఆ గ్రామంలోనే ప్రాచీన శివాలయం అయిన బాల ఖండేశ్వర గుడి ఉంది. అక్కడకు వెళ్లి దర్శనం చేసుకోవాలని తెలిపింది. ఈ వార్త ఆ నోట ఆ నోటపాకి జర్నలిస్టులకుచేరి అన్ని దినపత్రికలలో సంచనలవార్తగా ప్రచురితమైంది. బ్రిడ్జివద్ద  ఎక్కడ నుంచి తన శంగలపెట్టెను త్రోసివేసినదీ వివరించింది మీనూ. తన భర్త మంచివాడేనని,నర్సు ప్రోద్భలంతోనే తనను హత్యచేసాడని చెప్పింది. తన పెళ్ళి ఫోటోలు చూసి దుఃఖించింది. ఇదీ జరిగినకథ.

ఇక దీనిని జ్యోతిషశాస్త్రపరంగా ఇలా విశ్లేషించారు.

పూర్వజన్మలోని సుధ జననం - 1953.3.21

ఉ. 7.26  26 N 29; 80 E 21

రాశిచక్ర వివరములు - లగ్నం - మేషం రాశి, వృషభం, రోహిణీ నక్షత్రం. జననకాల చంద్ర దశాశేషం 1 సం 4 నె 21 రో.

| | | |
|---|---|---|
| చ | కు గు<br>శు ల 1 | ర,బు |
| కే 4 | సుధ | రా<br>10 |
| | 7<br>శ | |

2. పునర్జన్మలో మీనూ జాతకం

జననం -  1979-12-19 రాత్రి 3 గం॥

26 N 48; 80 E 43

ధనుస్సురాశి, మూలానక్షత్రం. కేతుదశా శేషం 1 సం-3నె-25రో.

| | | |
|---|---|---|
| | 7 | కే |
| 10 | మీనా | శు 4 |
| గు రా కు శ | ల 1 | ర,చ బు |

3. సుధ మరణ సమయం 1978-10-25 మధ్యాహ్నం 12 గం॥ 27 N 23; 80 E 10; ఆశ్లేషా నక్షత్రం.

| | | |
|---|---|---|
| | | కే |
| చ గు | మరణ సమయం | |
| శ రా | ర బు శు | ల కు |

సుధ భర్తయొక్క జన్మ వివరములు లభించని కారణముచే అది పరిగణనలోనికి తీసుకోవడం కుదరలేదని విశ్లేషకులు వివరించారు.

సుధయొక్క వైవాహికజీవితం, మరణవిధానం, మరణ సమయం అన్నీ జ్యోతిషశాస్త్రపరంగా అష్టమస్థానం 22వ ద్రేక్కాణం మొ॥ విషయాలతో విశ్లేషించారు. అవన్నీ వ్రాయుటలేదు. ముఖ్యమైన పునర్జన్మ విషయం గూర్చి వివరించబడుచున్నది.

శిశు జననానికి ముందు, అనగా గర్భధారణ జరిగిన సమయాన్ని ఆధానలగ్నం అంటారు. దీనిని భారతీయ జ్యోతిషవేత్తలు, సెఫారియల్‌వంటి ఆధునిక జ్యోతిష వేత్తలూ కూడా పరిగణనలోనికి తీసుకున్నారు. పాశ్చాత్య జ్యోతిషవేత్తలు దీనిని జనన సమయాన్నిసరిదిద్దడానికి ఉపయోగిస్తూ ఉంటారు. ఆ విధంగా మీనూయొక్క ఆధానలగ్న చక్రం ఇలా ఉన్నది.

ఆధాన లగ్న సమయం 1979.3.17 ఉ.1.28 స్థలం బెతర్.




## పరిశోధించిన విషయములు

1. మీనూ యొక్క జన్మలగ్నమైన తుల, పూర్వజన్మలోని సుధయొక్క మారకస్థానము (7వస్థానము)

2. సుధయొక్క మరణకాల లగ్నము ధనుస్సు మీనూయొక్క ఆధాన కాల లగ్నమూ దనస్సే.

3. సుధ జాతకములో భవిష్య జన్మను సూచించు స్థానము 5. ఇది సింహరాశి. దీని అధిపతి రవి. మీనంలో ఉన్నాడు. ఇది ఉత్తర దిశను సూచిస్తుంది. రవి నక్షత్రకులజుడు. కనుక సుధ భవిష్యజన్మలో కాన్‌పూర్‌నకు ఉత్తరంగా బెతర్‌లో 20 ని॥లు ఉత్తర అక్షాంశంగా, 22 ని॥ రేఖాంశంగా క్షత్రియ కులంలోజన్మించింది.

4. మీనూ జాతకంలో 9వ స్థానం గతజన్మను తెలియజేస్తుంది. ఇది మిధునం. అధిపతి బుధుడు. మిధునం పడమర దిశను, బుధుడు వృశ్చిక మందుండుటచేత ఉత్తరదిశను సూచించు చున్నవి. సుధ హర్దోయ్‌లో చంప బడింది. ఈ గ్రామం 35ని॥ ఉత్తరఅక్షాంశలోనూ, 33ని॥ పడమర రేఖాంశం లోనూ ఉన్నాయి. మీనూగా జన్మించడాని జీవాత్మ పడమర దిశ నుంచి వచ్చింది.

5. సుధ జాతకంలో భవిష్య జన్మను సూచించు 5వ స్థానాధిపతి అయిన రవి, సుధ జన్మలగ్నానికి 24 డిగ్రీలదూరంలో ఉన్నాడు. ఇక మీనూ జాతకంలో గత జన్మను సూచించు 9వ స్థానాధిపతి బుధుడు మీనూ జన్మ లగ్నానికి 4 డిగ్రీల దూరంలో ఉన్నాడు. ఈ రెండింటివల్ల జనన మరణములు రెండూ దగ్గర స్థానములలోనే జరుగునని తెలియజేయుచున్నవి. సుధ మరణ స్థానము హర్దోయ్, మీనూ జన్మస్థానము ఉన్నాయ్ దగ్గరగానున్న ప్రక్క గ్రామములే.

6. అందరికీ ఆత్మకారకుడు సూర్యుడే. సుధ జాతకములో సూర్యుడు మీనంలో గురురాశిలో ఉన్నాడు. మరుసటి జన్మలో మీనూ జాతకంలో సూర్యుడు ధనుస్సులో గురు రాశిలో ఉన్నాడు. ఇట్టి సూర్యుడు గత జన్మ సంస్కారములను మీనూ జాతకంలో తెలియజేయుచున్నాడు.

7. సుధ జాతకంలో కుజ, గురు, రాహువులు పరస్పర కేంద్రములో ఉన్నారు. మరుసటి జన్మ మీనూ జాతకములో కుజ, గురు, రాహువులు ఒకే స్థానంలో ఉన్నారు. గతజన్మ చక్రమూ, వర్తమాన జాతక చక్రమునకు ఇట్టి పోలికలుండునని తెలియుచున్నది.

8. సుధ మరణానంతరం, మీనూగా జన్మించుటకు అనగా గర్భధారణ జరుగువరకు నాలుగు నెలల 22 రోజుల అంతరమున్నది. ఈ సమయములో సుధ సూక్ష్మ శరీరముగానున్నట్లు తెలియుచున్నది. ఇది మన పురాణములలో వర్ణించిన సూక్ష్మ శరీరధారణ నిజమని నిర్ధారణ చేయుచున్నది.

ఈ పై కారణములవలన పునర్జన్మ అనునది మూఢనమ్మకముకాదని, సశాస్త్రీయమైనదని మనము భావించాలి.

# పునర్జన్మ ఉన్నది

ప్రఖ్యాత సైకియాట్రిస్ట్ డా. ఎలిజబెత్ కుబ్లర్‌రాస్, అనేక పరిశోధనలు, పరిశీలనలు జరిపి పునర్జన్మ ఉన్నదనుట సందేహమేమీలేదని ప్రకటించారు.

ఇండియా నాలోనిరిచ్‌మండ్ కాలేజీలో 1975లో ఒక ప్రముఖ ప్రసంగము చేస్తూ, మరణానుభవములో మూడు ముఖ్యమైన అనుభూతులు సాధారణంగా అందరికీ కలుగుతాయని వివరించారు.

1. శరీరానికి బయట తన ఆత్మ గాలిలో ఊగుతున్నట్లు అనుభూతి కలుగుతుంది. (సూక్ష్మశరీరం విడివడుతుంది)

2. విశ్వవ్యాప్తంగా తాను వ్యాపించినట్లు, శాంతి పొందినట్లుగా అనిపిస్తుంది.

3. గతంలో మరణించిన తనవారిని చేరినట్లుగా అనిపిస్తుంది.

మరొక విషయం వివరించారు. అదేమిటంటే ఒకసారి మరణించి అనగా మరణానుభవంపొంది తిరిగి జీవించినవారు మరణమంటే ఎప్పుడూ భయపడరని చెప్పారు.

మరణానుభవం పొంది మరల జీవించినవారిని గూర్చి, NDE (Near death experience) గూర్చి, రేమాండ్ మూడీ 150 మంది అనుభవాలతో life after life అనే గ్రంథం రచించారు.

కొన్ని మరణానుభవ సదృశమైన అనుభూతులు మాదక ద్రవ్యాలు ఉపయోగించడంవల్ల, మార్ఫిన్ డెమెరాల్ వంటి మందులు వాడినపుడు కలుగుతాయి.

బెంగుళూరులోని 'నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్ అండ్ న్యూరోసైన్సెస్' సంస్థవారు 16 పునర్జన్మ కేసులు యధార్థమైనవేనని అయితే ఇందుకు సైన్స్ పరంగా వివరించుటకు వీలులేక అలా పెండింగ్‌లో ఉంచారు. ఈ కేసులలో ఒకటి అయిదు సం॥ల బాలిక తాను పూర్వజన్మలో ఒకపని మనిషిగా వివరాలు తెలిపింది. మరొక కేసులో 38 సం॥ల మహారాష్ట్ర వ్యక్తి వంద సం॥ల క్రితం వాడుకలోనున్న ప్రాచీన బెంగాలీ భాషను అనర్గళంగా మాట్లాడుతూ గతజన్మ సంబంధ వివరాలు తెలిపాడు.

ఇన్స్టిట్యూట్ వారు ఇలా 16 కేసులు యధార్థమైన పునర్జన్మకు సంబం ధించినవేనని, హిస్టీరియా, క్రిప్టోమెనిషియా, క్లయిర్‌వాయిన్స్, పొసెషన్ సింద్రోమ్, స్ప్లిట్ పెర్సనాలిటీ వంటివికావని నిర్ధారించారు. వర్జీనియా యూనివర్శిటీలో పేథాలజీ శాఖకు అధ్యక్షుడైన డా. ఇయాన్ స్టీవెన్‌సన్, బెంగుళూరులోని న్యూరోసైన్స్ సంస్థకు కొంతకాలం పనిచేశాడు. ఇతడు కూడా ఈ 16 కేసులు యధార్థ మనుటలో ఏమీ సందేహమవసరంలేదని ధృవీకరించాడు.

"మెనీమేన్షన్స్" అనే పుస్తకంలో జినా సెర్మినారా, క్లయిర్ వాయిన్స్ నాధారం చేసుకొని వ్యక్తియొక్క పూర్వజన్మలను వివరించే "ఎడ్గర్‌సైస్" అనే వ్యక్తిగూర్చి వివరించారు. ఇతడు 1877లో జన్మించాడు. పూర్వజన్మలను వివరించేశక్తి ఇతనికి 1923లో వచ్చింది. 1945లో చనిపోయాడు. చనిపోయేనాటికి 2500 మందికి పూర్వజన్మలు వివరించినట్లు రికార్డ్ చేయ బడింది. ఈజిప్ట్, అట్లాంటిస్ వంటి ప్రాచీన చారిత్రక కాలంలో కూడా కొందరికి పూర్వజన్మ సంబంధమున్నట్లు వివరించాడు.

అరవిందయోగి, పునర్జన్మ పొందడానికి ప్రత్యేకించి ఆత్మ అనేది వేరుగా ఉండదని, చేసిన కర్మలే సంస్కారములే, వాసనారూపంగా అహంగా రూపొంది మరుజన్మ పొందడానికి కారణం అవుతుందని చెప్పారు. మరణం అనేది సమాప్తం కాదు. ఈ విశ్వమే ఒక అంతంలేని చైతన్య పరిణామం గల ప్రవాహం. చైతన్య స్థితులే సూక్ష్మంగా భౌతికంగా మానసికంగా అతి మానసి కంగా ఆవిర్భవించి పరిణమిస్తుంటాయి. జాగ్రదవస్థ, నిద్ర, మరణం అన్నీ ఇందులోనే స్థాయీ భేదాలు. ఈ చైతన్య పరిణామంలో జననం (జీవితం) నిద్ర, మరణం అనేవి మజిలీలు. ప్రయాణం అలా నిరంతరంగా సాగుతూనే ఉంటుంది.

–)00(–